# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం 30—10—'64
క్రోధినామ సం॥ ఆశ్వయుజ మాస బ॥ దశమి
సంపుటము 57 సంచిక 9
స్థాపితము:
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

**ఒక సంవత్సరం చందా వివరాలు**

ఇండియా రూ. 15.60. ఇతర దేశాలు ఓడమీద ( Sea Mail ) రూ. 28 60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ. 120.00. అమెరికా రూ. 176.80. ఆస్ట్రేలియా రూ. 148.20

విడిప్రతి 30 పై.
సంవత్సర చందా 15 60 పై.
6 మాసాల చందా 7.80 పై.

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1


## రచయితలకు విజ్ఞప్తి

తమ రచనలతో కాక విడిగా స్టాంపులు పంపే వారి రచనలు తిప్పి పంపడం సాధ్యం కాదు. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపే అవకాశం కూడా లేదని గుర్తించ ప్రార్థన.

సం॥

## మనలో మాట

రెండు వారాలుగా న్యూస్‌ప్రింటు కొరత చాలా ఎక్కువగా ఉంది! దానివల్ల ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముద్రణ సంఖ్య తగ్గడమే కాక అసలు పత్రిక బజారులోకి రావటం కూడా ఆలస్యం అవుతోంది. ఈ ఇబ్బంది పై వారంలోనూ ఉండవచ్చు. పాఠకులకి కలిగే యీ ఇబ్బందికి చింతిస్తున్నాము.

* * *

6-11-'64 ఆంధ్ర సచిత్ర వారపత్రిక దీపావళి సంచికగా వెలువడుతుంది. అయితే, పైన చెప్పిన కారణాలవల్ల ఈ సంచికలో ఎన్ని పేజీలు వెయ్యగలిగినదీ నిర్ణయించలేకపోతున్నాము! ఈ సంచిక ఉత్తరాల పేజీలో వేసిన ప్రకటనలో వివరించిన విశేషాలు మాత్రం దీపావళి సంచికలో ఉంటాయి!

* * *

'ఈ వారం'లో ఎన్నో విశేషమయిన వార్తలు వెలువడ్డాయి— బ్రిటన్‌లో లేబర్ పార్టీ విజయం, క్రుశ్చేవ్ పదవి నుంచి తొలగటం, చైనా అణ్వాస్త్రం పేల్చటం, రష్యా ముగ్గురిని అంతరిక్షంలోకి పంపటం! వీటన్నిటి మీదా సావకాశంగా వ్యాసాలు వేరే వెయ్యగలమని ఆశిస్తున్నాము.

* * *

బూట్ పాలిష్ బాలురకు చెందిన సచిత్ర వ్యాసం యీ వారం వేశాము. వ్యాసకర్త, ఫొటోగ్రాఫరూ సుమారు ఏడెనిమిది గంటల ప్రయాసతో యీ విషయాలను సేకరించారని తెలుస్తోంది!

* * *

ఈ సంచికలోని మూడు కథలూ కూడా చిన్నవే కావడం మరొక విశేషం!

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : 'మజ్‌బూర్'లో వహీదా రహమాన్

### యదార్థగాథ

# పసివాని కన్నీటి కథ!

## వాశిరాజు ప్రకాశం

"ఇదీ మాఇల్లు! మానవ మాత్రులెవరూ వుండటానికి సాధ్యంకాని పూరిల్లు ఇది. ఎనిమిది సంవత్సరాల నుంచీ యీ చీకటిలో జీవిస్తున్నాం. ఈ కొంపలో అహోరాత్రాలు సూర్యుడు, చంద్రుడు చీకటి, ఎండ తాండవం చేస్తుంటాయి. అయినా మా రోదనంతా యీ లోకంలో ఎవరికొకావాలి?" అంటూ ఆ అబ్బాయి పుట్టెడు దుఃఖంతో కళ్లనీళ్లు పెట్టుకొన్నాడు.

అది ఇల్లు అని ఎవరన్నా అనుకొంటే, వాళ్ళు పొరబాటు పడ్డారన్న మాటే. ఎప్పుడో చిన్నవాడు, తాటాకులతో దాన్ని నిర్మించారు. ఆ తాటాకులు కూడా ఎండి, రాలిపోయినవన్ని పోయి, ఇంటికి నంకేతం అన్నట్టుగా అక్కడక్కడ మాత్రం కొన్ని మిగిలి ఉన్నాయి. కొంచెం పొడుగరి మనిషి ఆ ఇంట్లో నిలబడితే, పంచ కప్పు నెత్తికి తగులుతుంది. అఇంటిని ఎవరూ ఎప్పుడూ శుభ్రంగా అలికిన జాడైనా కనుపించ లేదు సున్నం. . సరేసరి! ఎన్నేళ్లయిందో గోడలకు సున్నం వేయించి. ఇల్లంతా వెలవెల బోతున్నది ఇటీవలి కాలంలో ఆ ఇంట్లో దీపమైనా వెలిగించిన జాడ కనుపించదు!

ఆ అబ్బాయి మాట్లాడుతూనే ఉన్నాడు కళ్ల వెంట నీళ్ళు కారుతూనే ఉన్నాయి. మధ్య మధ్యలో అతను వెక్కివెక్కి ఏడుస్తున్నాడు.

ఇదంతా చూస్తున్నా, ఆ అబ్బాయి చెప్పేనవి



ఏమీ పనిలేనప్పుడు, రాము అక్కడే కూర్చుని చిన్న కునుకు తీస్తాడు.



ప్రొద్దుటినుంచి సాయంత్రం వరకు ఇలా ఎన్నెన్నో బూట్లు పాలిష్ చేసినా జీవితం గడపటం 'రాము'కు చాలా కష్టమని అనిపిస్తుంది.

విన్నా— నాకూ, మా ప్రభాకర్‌కూ ఎంతో జాలేసింది.

* * *

ఆ రోజు ఆదివారం. నగర వీధులన్నీ నిశ్శబ్దంగా నిద్రపోతున్నాయి. మిగతా రోజులలో ఉండే సందడిలో, ఆ రోజున ఏదో వంతు కూడా లేదేమో!

ఆదివారపు నగర జీవితాన్ని చూద్దామనీ, సరదాగా రోజంతా గడుపుదామని ఆ రోజు ఉదయాన్నే నేనూ ప్రభాకర్ బయల్దేరాం. కెమెరా బుజాన్ని తగిలించుకొని, నా ప్రక్కనే నడుస్తున్న ప్రభాకర్‌నూ, నన్నూ మొదట ఆకర్షించిన వ్యక్తి రాము.

రోడ్డు మీదనే ఒక ప్రక్కగా కూర్చొని 'బూట్ పాలిష్' చేస్తుంటాడతను. బాధ్యతలు ఎక్కువయినా, అతనిలో మాత్రం ఆ పసిదనం ఇంకా మిల మిల లాడుతూనే ఉంది.

"ఏం బాబూ, ఏ వూరు మీది" అని అడిగాం. అతను మా వైపు ఎగాదిగా చూశాడు— ఏవూరయితే మీకెందుకన్నట్టు.

తరువాత కొంతసేపు లాలనగా, పాలనగా మాట్లాడాం. ఆ అబ్బాయిని నవ్వించాం, పూరడించాం, మాటల్లోకి దించాం. తన కథ, తన బొమ్మలూ పేపర్లో అచ్చవుతాయని చెప్పేసరికి ఆ అబ్బాయి ఎంతో మురిసి పోయాడు. అతనిలో ఎక్కడ లేని ఉత్సాహం వచ్చింది. వెంటనే తన అంగడిని కట్టేశాడు. కట్టేసి—"రండి, మా ఇంటికి. మా బాబును చూపిస్తా. మా ఇల్లు చూపిస్తా" అంటూ మమ్మల్ని పిలుచుక వెళ్ళాడు.

తన కథ చెప్పమనీ, తన దేవూరో, ఎందుకీ 'బూట్ పాలిష్' పని చేస్తున్నాడోనని అడిగాను. "ముందు మా ఇల్లు చూడండి. తరవాత అన్నీ

"చెప్తాను" అన్నాడు. తన ఇంటిని గురించి, తన పరిస్థితిని గురించి జాలిగొలిపే మాటలెన్నో చెప్పాడు.

ఆ నాటికి అతను అన్నం ముఖం చూచి రెండు రోజులయింది. ఆకలయితే హోటలు కెళ్ళి "రెండిడ్లీ సాంబారు" తిని మంచినీళ్లు తాగేవాడట.

"ఎందుకురా రామూ, అలా చేస్తావ్" అని అడిగాను. అతని సమాధానం వింటే ఒళ్లు జలదరించి పోతుంది.

అతనంటాడూ, "ఈ ఇంటిని నేనే పోషించాలి. నే డబ్బు తెస్తేనే ఇంటోళ్లు తిండి తింటారు. లేకపోతే ఆ పూటకు పస్తులే."

క్రమేణా చెప్పుకొంటూ వచ్చాడు తన కన్నీటి గాథను. వాళ్లది ఈ నగరానికి ఇరవై మైళ్ల దూరంలో నున్న ఒక చిన్నపల్లె. దాదాపు ఎనిమిదేళ్ల క్రితం మద్రాసు వచ్చేశారు. సొంత పల్లెటూళ్లో వాళ్లకు ఇల్లూ, కొద్దిగా పొలమూ ఉన్నాయట. అలాంటి స్థితిలో ఆ వూరు వదలి, ఈ 'నగరపు నరకానికి' ఎందుకు రావలసి వచ్చిందోనన్న అనుమానం మీకే కాదు, నాకూ కలిగింది !

అందుకు కారణం ఇది : అతని తండ్రి స్వతహాగా వ్యవసాయదారుడు. వయస్సులో పెద్దవాడు కాబో తున్న స్థితి కొస్తున్న తరుణంలో, ఆ పల్లెలో తాను చేయని దొంగతనానికి, ఆ తండ్రి బాధ్యుడయ్యాడట. ఆ గ్రామమంతా కలిసి ఆయన్ని నానా హింసలూ పెట్టింది. 'ఏదీ నగానట్రా' అని కొందరు గద్దించారు. మరి కొందరు మాటుపోటు ప్రశ్నలు వేశారు. ఇంతలో వూరి పెద్ద వచ్చి, "రెండు రోజులలో దొంగసొమ్ము బయటికి తేకపోతే పోలీసులకు అప్పగిస్తా"నన్నాడట. అంతే! ఆయన ఆ నగరాన్ని విడిచి వచ్చాడట.

అప్పటికి రాము వయస్సు పదేళ్లు. తల్లి ఒళ్లో సుఖంగా ఆడుకొంటున్న 'రాము'కు నరకపు జీవితం ఆ నాటి నుంచే ప్రారంభమైంది. అతని తండ్రీ, తల్లీ, అన్నా, అక్కా, తమ్ముడూ, చెల్లెలూ —అందరూ నగరానికి వచ్చారు.

నగరపు జీవితాన్ని కూలంకషంగా తెలిసికొన్న వాళ్లకే, అప్పుడప్పుడు ఇక్కడ ఎదురు దెబ్బలు తప్పవు. అలాంటి నగరపు ముసుగూ, మోహమూ తెలియని ఈ కొత్త వాళ్లకు ఇక్కడ పలకరించే దిక్కైనా ఉంటుందని ఎలా ఆశిస్తాం ?

రాగానే, వూరికి దూరంగా ఉన్న గుడిసెల కాలనీలో మరొక ప్రక్క అతి కష్టం మీద ఒక గుడిసెను నిర్మించుకొన్నారు వాళ్ళు.

కాని, విధి ఇక్కడ కూడా ప్రతికూలించింది. వచ్చిన కొన్నాళ్లకే, ఆ ఇంటి ఇల్లాలైన రాము తల్లికి అనారోగ్యం ప్రారంభమైంది. ఆ నాటి నుంచి నేటివరకూ అదే అనారోగ్యం. ఆ తల్లి మంచాన పడి ఉన్నదీనాడు.

**తండ్రి** : నగరమైనా, పల్లెయైనా పొట్ట గడవాలిగా ? అందుకోసం రిక్షాను తొక్కుతూ, మధ్య మధ్యలో రిక్షా యజమానుల దౌర్జన్యాన్ని సహిస్తూ, పోలీసుల నియమావళికి తలలొగ్గి జీవితం గడపటం ప్రారంభించాడు. కాని, దేహంలో రక్త మాంసాలు క్రమేణా క్షీణమై పోయాయి. ఆయన ఈ నాడు పండు ముదుసలి. లేచి మాస్తే తూలిపోయేటట్లున్నాడు. అయినా సరే, తన సంసారపు భారాన్నంతా పసివాడైన కొడుకు మీదకు తోసివేయటం ఇష్టం లేక, అప్పుడప్పుడు రిక్షా నడుపుతాడు.



ఇదీ వాళ్ల ఇల్లు : ఇందులో సూర్యుడూ, చంద్రుడూ కాపురం చేస్తుంటారు. ఆ ఇంట్లోనే 'రాము' జీవయాత్ర చేస్తున్నాడు.



ప్రొద్దున్నే పనికి వెళ్లేముందు, సాయంత్రం తిరిగి వచ్చాక, రాము తన తండ్రిని ఆప్యాయంగా పలకరిస్తాడు.

# 'రాము' లాంటి బూట్ పాలిష్ కుర్రాళ్లు ఎందరో వున్నారు!

**అన్న** : రాముకంటె పెద్దవాడొకడున్నాడు. పేరుకు పెద్దవాడే గాని, పనికి ఆఖరివాడే! ఇంటి పట్టున క్షణం ఉండే వాడు కాదు. వీధిలో తిరిగి కూలీ, నాలీ చేసి నాలుగు డబ్బులు సంపాదించుకొన్న రోజున ఇల్లు కనుపించదు! కానీ, డబ్బులు దొరకని రోజున మాత్రం భోజనం వేళకి ఇంటికి వస్తాడు. ఈ మధ్య నాలుగైదు నెలల నుంచీ అదీ లేదు! కారణం: అతను ఎక్కడో 'పిక్ పాకెట్' చేస్తూ దొరికి పోయాడట.

**అక్క** : రాముకంటె, వయస్సులో అతని అక్క ఆరేళ్లు పెద్దది. తల్లి తరువాత తల్లి అంతటిది ఆ ఇంట్లో. ముసలి తండ్రికీ, రోగిష్టి తల్లికీ నాలుగు మెతుకులు ఉడకేసి పెట్టవలసిన బాధ్యత ఆమెది. కాని ఎవరి బాధ్యతలు వాళ్లు సక్రమంగా నిర్వహిస్తే, ఇది లోకం ఎలా అవుతుంది? మరేదో అయ్యుండేది. ఆమె కూడా దాదాపు సంవత్సర క్రితం ఇంటి మీద అలిగి పారిపోయింది. ఆ పోవటం అంతే! ఇంత వరకు జాడలేదు!

**తమ్ముడు** : రాము కంటె రెండేళ్లు చిన్నవాడు. అన్నతో పాటు ప్రొద్దున్నే బూట్ పాలిష్ సంచీ మెడకు తగిలించుకొంటాడు. వీధిన పడతాడు. ఆ అయ్యనూ, ఈ అయ్యనూ బతిమలాడి, వాళ్ళ గడ్డాలు పట్టుకొని 'పాలిష్' చేస్తాడు. వచ్చిన పావలో, అర్ధో అన్న చిన్నన్న చేతికిస్తాడు.



అన్నా, తమ్ముడూ

**చెల్లి** : పాపం పసిది! ఆరేళ్లది! ఆకలి ఎలా తీర్చుకోవాలో తెలియనిది. అస్తమానమూ 'అమ్మా! ఆకలీ, ఆకలీ' అంటూ ఏడుస్తుంది. ఎంత ఏడిస్తే మాత్రం ఏం లాభం. పిచ్చి, పిచ్చి నాలుగు తిన్నులు తింటుంది. మళ్లీ ఏడుస్తుంది, ఆకలి తీరక, దాహం సమసిపోక, శోష వచ్చి తూలి, పడి, నిద్రపోతుంది. నిద్రలో కూడా "అమ్మా! ఆకలీ" అంటూ పలవరిస్తుంది, కలవరిస్తుంది.

రాము ఇంట్లో శాల్తీలాంటి స్వరూపాలు ఇవి.

ఇక ఆ ఇంటికి దిక్కూ, మొక్కూ, చిన్నా, పెద్దా— అన్నీ అతనే. ఐదుగురికి కావలసిన తిండిని ఒక్కడే, తన పసిరెక్కలతో, సంపాదించాలి.

ఇవన్నీ చెప్పుతూంటే, రాము కళ్ల వెంట ధారలు కారుతూనే ఉన్నాయి. అతని ముఖం నిండా దైన్యం వర్షిస్తూనే ఉన్నది.

పొద్దున్నే ఐదు గంటలకు నిద్రలేస్తాడతను. అమ్మను, నాన్నను నిద్ర లేపుతాడు. కొళాయి దగ్గర కెళ్లి పది బిందెలు నీళ్లు తెస్తాడు. రాత్రి అన్నం తిన్న గిన్నెలన్నీ కడుగుతాడు. తమ్ముణ్ణి నిద్రలేపుతాడు. చెల్లెల్ని నిద్రలేపి, మొహాలు కడుగుతాడు. రాత్రిది చద్దన్నం మిగిలితే తమ్ముడికి కొద్దిగా, చెల్లెలికి కొద్దిగా పెడతాడు. తన దగ్గర ఉన్న కొద్ది డబ్బులతో తండ్రికీ, తల్లికీ ఎనిమిది నయాపైసల 'టీ' రెండు గ్లాసులతో తెస్తాడు. అందరినీ భద్రంగా ఉండమని చెప్పి, తమ్ముణ్ణి తీసికొని బయల్దేరుతాడు. తమ్ముడూ, తనూ వేర్వేరు చోట్లనే కూర్చొంటారు. అలానే పది గంటల వరకూ కూర్చొంటారు. ఇద్దరికీ కలిపి ఒకటో, రెండో రూపాయలు వస్తే తమ్ముడి చేత ఇంటికి పంపుతాడు. మిగిలిన డబ్బులతో ఇద్దరూ హోటలు కెళ్లి టిఫిన్ చేసి వస్తారు. మళ్లీ ప్రారంభం 'బూట్ పాలిష్'.

ఈలోగా, ఇంట్లో తండ్రీ, తల్లీ [illegible] సాయంత్రంలో మంటపెడుతూ, పడుతూ, లేస్తూ, ఏడుస్తూ, నాలుగు మెతుకులు ఉడకేస్తారు. ఉన్నదాంట్లోనే కొద్దిగా తిని, కొద్దిగా మిగుల్చుతారు పిల్లల కోసం.

రాము కోసం అతని తమ్ముడే అన్నం తెస్తాడు. ఇద్దరూ కలిసి ఎక్కడో నీడ పట్టున కూర్చొని తింటారు. అలానే సాయంత్రం వరకూ గడుస్తుంది. మళ్ళీ, చీకటీ, ఇల్లూ, నిద్ర, వేకువా ఆరంభం!

* * *

రాము దైనందిన కార్యక్రమం ఇంకా [illegible] ఉండుండేదేమోనని, ఎన్నెన్నో ప్రశ్నలు వేశాను. [illegible] ఫొటోలు తీస్తూనే ఉన్నారు.

రాము మాతో దారుణమైన సంఘటన చెప్పాడు. సరిగ్గా వారం రోజుల క్రితం, ఒక పెద్ద మనిషి వచ్చి 'పాలిష్' చేయించుకొన్నాడు. పాలిష్ [illegible] చేసినందుకు న్యాయంగా అంతా ఇరవై నయాపైసలు పుచ్చుకొంటారు. ఆయన మాత్రం పది నయాపైసలే ఇచ్చాడు. మరో పది పైసలివ్వాలని రాము వినయంగా అడిగాడు. ఆ పెద్ద మనిషి, [illegible], గొంతువాడికి [illegible] వచ్చింది కాబోలు— పాలిష్ చేయించుకొన్న అదే బూటు కాళ్లతో రాము గుండెల మీద కొట్టాడు.

42వ పేజీ చూడండి



మధ్యాహ్నం కాగానే నేనూ, తమ్ముడూ కలిసి భోజనం చేస్తాము


చూశారా! మీకన్నా మేం చాలాపొడుగు
అమెరికా
ఆటం బాంబు


మనల్ని మనమే అభినందించుకొందాం! కృశ్చేవ్ వెళ్లిపోయ్యాడు
మావో
స్టాలిన్ దయ్యం


ఈయన్ని ఆ గుఱ్ఱం ఎలా మోసుకెళ్తుందో!
బ్రిటిష్ లేబర్ ప్రభుత్వం
మెజారిటీ


అయూబ్
ఈ పేద కేలలో అంతరవాం ఏముందో!

# విషాద విస్మయ వినోద వార్తావళి!



ఒకడు చోదకుడు వాల్డిమిర్ కొమరోవ్, రెండవవాడు డాక్టరు బోరిస్ యేగరోవ్, మూడోవాడు శాస్త్రకారుడు కాన్‌స్టాన్‌టిన్ ఫియోక్టిస్టోవ్‌లు ముగ్గురూ—పారాచ్యూట్‌ల సాయంలేకుండా వాహనంతోనే తిరిగి దిగారు.

మాస్కోలో భారతీయులు మొరటుగా హాకీ ఆడుతున్నా— బొంబాయిలో పటౌడీ బృందం మద్రాసులో నేర్చుకున్న పాఠాలు 'కంగారూ'లకి అప్పగించడానికి ధైర్యంగా సిద్ధమవుతూవున్నా— దైనందిన సమస్యలతోనూ— యిటీవల వరదలు వొదలిపోయిన భీభత్సంలోను— మండిపోతున్న అధికధరలు క్రిందా— మాయమైపోతున్న తిండిగింజల వెంటా— పడి పరుగెడుతున్నందున చాలామంది ప్రజలు (అక్టోబర్ రెండో వారాంతంలో) బ్రిటన్‌లో గద్దె కెక్కనున్న లేబర్ పార్టీని కూడా అంతగా పట్టించుకో లేకపోయారుగాని అక్టోబర్ 13 న రష్యావాళ్లు ముగ్గురు రోదసిలోకి దూసుకుని పోయారంటే ముక్కున వేలేసుకుని చూశారు. 'చంద్రమండలానికి మరో అంచె దగ్గరిగా వెళ్లాం' అనుకున్నారు. బియ్యం కోసం నిలబడ్డ క్యూలో మరో అంగుళం కదిలినంత సంతోషంగా ఆ మర్నాడు రోదసీత్రయం క్షేమంగా రావడాన్ని చెప్పుకున్నారు. అక్టోబరు పదిహేనో తారీఖున 'క్రికెట్‌లోను రష్యాలోను ఏం జరిగినా ఆశ్చర్యపోనక్కర్లేదు' అనుకుంటూ— ఆస్ట్రేలియా మీద ఇండియా గెలుచుకున్న రెండు వికెట్‌ల విజయాన్ని పంచుకున్నారు గాని, ఆ మర్నాడు రష్యాలో జరిగిన సంఘటన, చైనాలో జరిగినసంఘటనా,వింటూనే ముక్కున వేసుకున్న వేలు గుండెల మీద వేసుకున్నారు!

"ఎంత దారుణం!" అనుకుని ప్రపంచంయొక్క విస్మయాన్ని భయాందోళనలను పంచుకున్నారు.

**శ్రీ నికితా కృశ్చేవ్ భౌతిక కాయం మాత్రం రష్యాలోనూ, కీర్తికాయం రష్యా వెలుపల మిగిలిపోయిన రోజది!**

"ఎంత పతనం ?"— తెల్లారేసరికి పరకాం దేశాల అధికారంలో మహా బలిమిగా ఉన్న కృశ్చేవ్ రూపు మాసిపోయింది ?— చైనా వాడు ఈ పండగ అటమ్ బాంబుతో జరుపుకున్నాడా ? అన్నట్లు అదే రోజున "తొలి అణ్వాస్త్ర ప్రయోగం చేసి, అణ్వాయుధ దేశాల్లో ఐదో వాడ"య్యాడు. గుండెలు ఝల్లుమనే ఈ వార్తల మధ్య బ్రిటన్‌లో కాస్త తేడాతో అయినా అధికారానికి చాలిన మెజారిటీని పుంజుకుని హెరాల్డ్ విల్సన్ లేబర్ పార్టీ ధ్వజం ఎత్తాడు! ("కేబినెట్! ఎక్కడున్నావ్ నువ్వు ?")

అక్టోబర్ పన్నెండు: తొలి "ప్రయాణీకుల రోదసీ నౌక" అంతరిక్షయానం— పదమూడు: రోదసీత్రయం— ఒకడు చోదకుడు మరొకడు వైద్యుడు, మూడోవాడు శాస్త్రజ్ఞుడు, తిరిగి రావడం— పదిహేను: భారత్ ఆస్ట్రేలియా మీద రెండు వికెట్ల విజయం— పధమూడేళ్ల టోరీ హయాంకి బ్రిటన్‌లో స్వస్తి— కాని ఆ ఉత్సాహాన్ని ఉప్పెనలా చెరిపేస్తూ పదహారున ప్రపంచ రాజకీయ రంగం నుంచి శ్రీ కృశ్చేవ్ నిష్క్రమణ— పుండు మీద కారమా ? అన్నట్లు చైనావాడి అణ్వస్త్ర ప్రయోగం— ఆ వారం రోజుల పతాక శీర్షికలన్నీ ఉత్తేజంగా, భయం, విస్మయాలతో, అట్టుడికినట్లున్నాయి! అనుకోని మార్పులు, అకస్మాత్ ప్రకటనలు మామూలు మనిషి గుండెల్లో బరువుగా ప్రవేశించాయి! విషాద వినోద విస్మయ వార్తావారంలో ఉక్కిరి బిక్కిరి అయ్యాడు మనిషి.

విజ్ఞులు, రాజకీయజ్ఞులు, నిపుణులు అనబడే

## న్యూఢిల్లీ లేఖ

# రామలీల దుర్గపూజల సంరంభం!
# నాలుగో ప్రణాళిక : కొన్ని సాధక బాధకాలు!

**ఢిల్లీ నగరాన్నంతా వేడుకలలో ముంచెత్తివేసే, రామలీల దుర్గపూజ ఉత్సవాలు గతవారంలో జరిగి పోయాయి.**

ఈ ఉత్సవాలకు రాష్ట్రపతి డాక్టర్ రాధాకృష్ణన్ ప్రతి ఏటా సంప్రదాయంగా హాజరు అవుతుంటారు. ప్రసిద్ధుడైన మహమ్మదీయ దైవ భక్తుడు నిజాముద్దీన్ సంస్మరణార్థం ఏటేటా జరిగే 'ఉర్స్' ఉత్సవాల్లాంటివాటికికూడా ప్రారంభించటం లాంటివి రాష్ట్రపతికి అనవాయంగానే వస్తున్న అంశాలు.

## వి. ఐ. పి. లు!

కులమత వర్గ రాహిత్యాలతో కూడినది ఈనాటి సమాజం. ఇలాంటి సభ్య సమాజంలో వి.ఐ.పి.లుగా చలామణీ అవుతున్న ప్రభుత్వ ప్రముఖులే పెద్దలు. విదేశీ రాయబారులు, విదేశాల ప్రభుత్వాల ప్రతినిధులుకూడా ఈ 'వి ఐ పి'ల కోవకు చెందిన వాళ్లే. చెప్పొచ్చేదేమంటే ఈ రామలీల ఉత్సవాలలో విదేశ ప్రతినిధులు, రాష్ట్రపతి, ప్రధాని, విదేశాంగ మంత్రి, మరో ప్రభుత్వ ప్రముఖుడూ పాల్గొనటం అవసరంగాను, హోదాగాను పరిగణింపబడుతోంది. వీళ్లందరు పాల్గొనటం ద్వారా రామలీల ఉత్సవాల నిర్వాహకులు 'తమకు మంచి పలుకుబడి ఉన్నట్లు' వేసే బాకాలు వాయించుకోనకుండానే సరిపోతున్నది.

మరో సంగతి. రామలీల కథా నాయకుడైన రాముడు బ్రాహ్మణుడు కాదని లోగడనే వ్రాశాను. ఇప్పుడూ అదే వ్రాస్తున్నాను. అయినప్పటికీ రామలీల ఉత్సవాలలో రాముని పాత్ర ధరించేందుకు బ్రాహ్మణ పిల్లల్నిమాత్రమే తీసుకోవటంలో ఔచిత్యం ఏమున్నది ?



మొదటిసారి దేశాన్ని వదలి అతిముఖ్యమైన అలీన దేశాల సమావేశంలో పాల్గొనే నిమిత్తం కైరో వెళ్ళి విజయవంతంగా తిరిగి వచ్చిన ప్రధాని లాల్ బహదూర్ కి ప్రేమతో స్వాగతం యివ్వబడింది!

## 'పబ్లిసిటీ' తాపత్రయం

నగరంలోని వాటకందార్లు కొందరు ఈ మధ్యనే అధిక ధరల వ్యతిరేక ఉద్యమాన్నొక దానిని ఆరంభించారు. కాఫీతో మొదలయిన ఈ ఉద్యమం, 'స్వీట్సు' మీదకు వెళ్లింది. 'ఇదే సందుకదా' అనుకుని మునిసిపల్ కౌన్సిలర్ ఒకాయన 'ఉల్లిగడ్డ'ల నమ్మి— 'పబ్లిసిటీ' కోసం కొంత తాపత్రయ పడ్డారు. నందాగారు సరేసరి. ఆయన పేరు సాధువులకు, సన్యాసులకూ బాగా తెలుసు. అందువల్లనే ఆయన్ను కొందరు 'మహామంత్రి' అంటారట. నందాగారి కథనం ప్రకారం ధరల పెరుగుదలను అరికట్టడంలో ఢిల్లీ నగరం కొత్త ఆదర్శాన్ని నెలకొల్పిందట. రెండేళ్ల క్రిందటి వరకు లాలా గుల్జారీలాల్ నందా ప్లానింగ్ కమిషన్ ఉపాధ్యక్షుడుగా ధరలు తగ్గాలంటూ ఆక్రోశించారు. అప్పటినుంచే ధరలు ఇంకా పెరిగాయి.

ఇంతలో నందాగారు 'హోంమంత్రి' అయారు. ఆయన దృష్టికూడా 'లంచగొండితనం' నిర్మూలనమీదకు మరలింది.

## చేతకానితనం

ధరల తగ్గింపుకు ప్రజల్లో జరిగే ఎలాంటి కృషికైనా ప్రభుత్వపు ఆదరణ లభించి తీరుతుంది. ఇలాంటి కృషివల్ల ప్రభుత్వానికికూడా కొద్దో, గొప్పో విముక్తి కలుగుతుంది.

కాని మరో ప్రశ్న. ప్రభుత్వం వైపున 'చేతకానితనం' లేకపోతే, ప్రజలు కృషి చేయవలసిన అవసరం ఎలా వస్తుంది ? ప్రభుత్వంవారు ఏ విధంగా అసమర్థులై కూర్చున్నదీ తెలుస్తూనే ఉన్నది తమ అసమర్థతకు కారణాలైనా తెలుపక

48 వ పేజీ చూడండి




## జరిగిన కథ

డాక్టర్ సీత, తన స్నేహితురాలయిన డాక్టర్ రాధకు తమ కుటుంబ గాథను చెపుతూవుంటుంది... 'జానకి, సీత అక్కచెల్లెళ్ళు. జానకీ రామారావులకు పెళ్ళవుతుంది. జానకికీ, చనిపోయిన చినమామయ్యకీ సంబంధం వుందన్న కోపంతో రామారావు ఆమెను చిన్నచూపు చూస్తాడు. భార్యాభర్తల మధ్య తీవ్రమైన అభిప్రాయభేదాలు రావటంతో, జానకి ఆశించిన ఆనందాన్ని పొందలేకపోతుంది. జానకిపై రామారావు అనుమానం నానాటికి పెరిగిపోతూ వుంటుంది. పండుగకు జానకి దగ్గరకెళ్ళిన సీత, ఆ సంసారాన్నంతా బాగా అర్థం చేసికోగలుగుతుంది. సినిమా హాలులో రామారావు, విద్యార్థిని రమతో మాట్లాడటం సీతలో అనుమానానికి దారితీస్తుంది. ఆ సంగతి ప్రస్తావించిన జానకికి రామారావు చేతిలో మళ్ళీ చీవాట్లు తగిలాయి. మున్ముందు రామారావు రమను తన యింటికే తీసుకొస్తున్నాడన్న వార్త జానకి పుట్టింట్లో సంచలనాన్ని కల్గిస్తుంది. సందర్భవశాత్తు ఒకనాడు ఆ రమాదేవి ఇంటికే సీత వెళుతుంది. సీత ప్రయత్నం ఫలించి, జానకి కాపురం కుదుటబడుతుంది. రామారావు జానకిని ఆప్యాయంగా చూసుకొంటూంటాడు. భర్త తనను ప్రేమగా చూస్తున్నప్పుడు తను ఆయన నిత్యావసరాలను తీర్చేందుకు నోచుకోనందుకు చాలా బాధపడుతుంటుంది. సీత రమాదేవి పుట్టినరోజు పండగకి వాళ్ళింటికి వెళ్ళి రమాదేవి వదినెగారి సూచనలకు విరుద్ధంగా తన అభిప్రాయాన్నిస్తుంది. పర్యవసానంగా రమాదేవి జానకివాళ్ళింటికి పూర్వంలా రావటానికి వీలుపడని పరిస్థితి కల్గుతుంది. సీత రమాదేవి ఊసు ఎత్తగానే అంతవరకూ ఆనందంగా మాట్లాడుతున్న రామారావు మౌనంగా అక్కడినుంచి వెళి పోతాడు.

## 12

"రమాదేవి సంగతి మాట్లాడగానే బావ వెళ్ళిపోయారేమే అక్కా" అని అక్కయ్యవైపు చూస్తూ అడిగాను. అక్కయ్య ఒక్క నిట్టూర్పు విడిచి మెల్లిగా లేచింది. దిగలేక దిగలేక మంచం దిగింది.

ఇద్దరిలోనూ ఈ మూగ వేదన ఎందుకో నా కర్థం కాలేదు. ఆలోచిస్తూ అట్లాగే కూర్చుండిపోయాను. దొడ్లోకి వెళ్ళి అక్కయ్య మెల్లిగా వచ్చి మంచం మీద పడుకుంది.

"సీతా"

"ఏమిటే"

"మగవారి మనస్సును పూర్తిగా అర్థంచేసుకోవాలంటే ఒక జీవితకాలం సరిపోదేమో. ఎంతో లాలనగా, ఆదరణగా, ఆప్యాయంగా మాట్లాడ్తారు. కాని వాళ్ళ హృదయంలో ఒక మూల బయట పడని సత్యం దాగునే ఉంటుంది. అదేమి

"అంటే" అన్నాను.

"చాలామంది మగవారికి ముఖ్యంగా కవులకూ, కాలేజీ అధ్యాపకులకూ ఊహల్లో గాని, హృదయంలో ఏదో ఒక మూలగాని, భార్య కాక మరొక ప్రియురాలు ఉంటుందేమో ? ఏదో ఒక సమయంలో ఎన్నాళ్లుగా కప్పిపుచ్చినా ఆ విషయం బయట పడక మానదు." అన్నది అక్కయ్య.

నాకు నవ్వొచ్చింది.

"ఏదో కవిత్వ ధోరణిలో మాట్లాడుతున్నావా? నిజంగా అంటున్నావా" అన్నాను.

"కవిత్వ ధోరణికాదే. నిజంగానే అంటున్నాను. రమాదేవి మీ బావ హృదయంలో కొద్దిగా స్థానం ఏర్పర్చుకున్నది. నాకు తెల్సు. అయితే వారిద్దరూ శారీ సన్నిహితం (?) చెయ్యక పోయినా ఒకరి యందు మరొకరికి మమత, వాంఛా ఉన్నది. కాని లోకానికి వెరుస్తున్నారు." అక్కయ్య కళ్లొత్తుకుంది. ఈ మాటలు అక్కయ్య అన్నందుకు నేను ఆశ్చర్య పడలేదు. అక్కయ్యకే అలాంటి అనుమానం కలిగినందుకు నేనేం సమాధానం చెప్పాలో నాకు తోచలేదు.

"మనసా, వాచా భర్తనే తల్చుకుంటూ వారినే ఆరాధిస్తూ, వారి హితవునే కోరుతూ, వారి గౌరవ మర్యాదలను కాపాడుతూ కాపురం చేసే నాబోటి సంసార స్త్రీలకు ఇవి రోజులు కావే సీతా ! నాలాంటి వెర్రిబాగుల్ది భర్తరూపంలో తన ఛాయనే చూసుకుంటుంది కాని, ఆ ఛాయ వెనక మరొక స్త్రీ నీడ ఉందని తెల్సుకోలేదు. అది గ్రహించిన రోజున ఆ భార్య మానసిక సంక్షోభం ఎట్లా ఉంటుందో నీకు అర్థం కాదు." అన్నది అక్కయ్య.

# హృదయ కుసుమాలు

"ఏ మాటలు వింటుంటే నాకు ఆశ్చర్యంగా ఉందే. కాపురాని కొచ్చిన కొన్ని రోజుల వరకూ బావ నిన్ను అనుమానించారు. ఆ అనుమానాలు పోయి కాస్త కాపురం కుదుట పడిందనుకుంటే, ఇప్పుడు బావను నువ్వు అనుమానిస్తున్నావు. ఏరాయి అయితేనేం పళ్ళూడకొట్టుకోటానికి." అన్నాను.

"నిజమే సీతా. నా జీవితమే అనుమానాలపుట్ట. లేని దాన్ని ఉన్నదనుకుని బాధ పట్టంలో అర్థం లేదు. అది తాత్కాలికమైన మానసిక ఆందోళన. ఆ ఆందోళనకు అవధులు లేవు. ఏం చెయ్యాలో తోచదు కుమిలి కుమిలి ఏడవటం తప్ప. అది నిరాశను, చిగురింప చేసే ఆందోళన. ఇప్పుడు మీ బావ విషయంలో నేను పడే ఆందోళన లోకసహజమైంది. అందరూ వేలెత్తి చూపేని. కంటికి కనబడేది. ప్రస్తుతం ఊహ అయినా ఎప్పటికయినా నిజమే అయేది. రమాదేవి వార్ని ప్రేమిస్తున్నది. నేను అంతా అర్థం చేసుకునే చెప్తున్నాను. ఏ నాటికయినా నువ్వూ తెల్సుకుంటావు, అప్పుడు మీ బావ మనస్సు నువ్వూ అర్థం చేసుకోగలుగుతావు. జీవితాలు శాశ్వతం కావే సీతా. మాటలూ, చేతలూ మనం పోయినా కలకాలం చెప్పుకుంటారు. అదే లోకం తీరు." అన్నది అక్కయ్య.

నేను కొయ్యబారినట్లు కూర్చున్నాను. అక్కయ్య మనస్సు ఇంత అగాధంగా మారి పోయినందుకు విచార పడ్డాను.

*　　*　　*




"ఏమిట్రా? పాతపత్రికలన్నీ ముందేసుకూర్చున్నావ్ ??"
"కార్టూన్లు వేయడానికి !"

"అక్కయ్యకు తొమ్మిదో మాసం వచ్చింది. బొత్తిగా నీరసించి పోయింది. ఏ మాత్రం వంట్లో రక్తం లేనట్లుగా పాలిపోయింది. మందులూ, ఇంజక్షన్లూ ఇచ్చినా పరిస్థితి మామూలుగానే ఉన్నది.

ఉత్తరం రాయంగానే అమ్మ వచ్చింది. పురిటి ఏర్పాటు ఇక్కడే అని నిర్ధారణ చేసుకున్నారు బావ. అక్కయ్యను చూసి అమ్మ దిగులు పడ్డది ఈపురుడు ఎట్లా వెళుతుందోనని. లేడీ డాక్టరు మరేం ఫరవా లేదన్నది. రోజులు గడుస్తున్నాయి. రమాదేవి కనబడ్డంలేదు. బావ కూడా రమాదేవి సంగతి ఏం చెప్పటం లేదు. మామూలుగా కాలేజీకి వెళ్ళి వస్తున్నారు.

అక్కయ్యను చూస్తుంటే కడుపు తరుక్కుపోతుంది. కళ్ళల్లో ఉన్నాయి దాని ప్రాణాలు. ఇంట్లో కూడా నడవలేక, నడవలేక మెల్లిగా నడుస్తుంది. అమ్మ వెయ్యి దేవుళ్ళకు మొక్కుకుంది. బావ కూడా కొంచెం ఆందోళన పడసాగారు.

ఒక రోజు రాత్రి నాకు కలవచ్చింది. కల్లో ఒక్కటి దుండు ముక్కలాంటి పాపాయి నెత్తుకుని బావ నిల్చున్నారు. బావ ఎంతో సంతోషంతో పిల్లాడి నెత్తుకున్నారు. అక్కయ్య కనబడలేదు. బావ చేతుల్లోంచి జారిపోతూ నా దగ్గరకు వస్తానని ఎగుర్తున్నాడు. నేను రమ్మని చేతులు జాపాను. ఆ వెధవ, చేతులు నాకు అందించి నా దగ్గరకు వచ్చాడు. "ఏరా భడవా పిన్ని చంక నెక్కావ్ నీకు అమ్మకన్న పిన్నే ఎక్కువ మాలిమి అయిందిరా" అంటూ అక్కయ్య వచ్చింది.

అక్కయ్య పిల్చినా వాడు రానన్నాడు. "పాలిస్తా రారా" అన్నది అక్కయ్య. అప్పుడు వచ్చాడు అక్కయ్య దగ్గిరికి. అక్కయ్య ఎత్తుకున్నా నా దగ్గరికే వస్తానంటూ చేతులు చాపుతాడు. అక్కయ్య పాలివ్వటానికి తీసుకెళ్ళింది. "నువ్వూ పెళ్ళి చేసుకో సీతా. పసుపుముద్దలాంటి పసివాడ్ని ఎత్తుకుందువు గాని" అన్నారు బావ. బావ మాటలకు ఎంతో సిగ్గేసింది. అంతే, మెలుకువ వచ్చింది. కల అన్నానని తెల్సుకున్నాను.

తెల్లవారింది. బావ కాఫీ తాగుతూ కూర్చున్నారు. అక్కయ్య అక్కడే మంచం మీద పడుకుంది. అమ్మ వంటింట్లో ఉంది.

"బావా" అన్నాను.

"ఏం సీతా"

"అక్కయ్య కనటం వరకే. ఇంక పిల్లాడి పోషణ భారం మీదే. అక్కయ్యకు ఓపిక లేదుగా. అవ్వాళ విజయవాడ వెళ్లేటప్పుడు రైల్లో చూశావ్. అట్లాగే వాడ్ని మీరే ఎత్తుకు తిప్పుతూ సముదాయించాలి. పిల్లాడ్ని ఆడిస్తూ అక్కయ్యకు సాయం చెయ్యక పోతే మీకు కాలేజీ వేళకు వంట కాదు." అన్నాను.

"నేను పిల్లాడిని ఎత్తుకుంటానో లేదోనని నాకు పరీక్ష పెడతారా మీ అప్పచెల్లెళ్లు. అంత ఎత్తుకోలేకపోతే నో పని పిల్లని ఏర్పాటు చేస్తాను" అన్నారు బావ.

"అంతే గాని ఎత్తుకోరన్నమాట. మీ అబ్బాయిని మీరు ఎత్తుకోవటం కూడా కష్టమే. మీకేం గొప్పవాళ్లు. ఎంత మంది నౌకర్లనన్నా పెడతారు." అన్నాను.

"మరి పిల్లల్ని ఎత్తుకోటం చేతకాకపోతే ఏం చెయ్యాలి." అన్నారు.

"మర్చిపోయా పేరేం, పెడుదామనుకున్నారు? ఏమే అక్కా. అసలింతకీ అబ్బాయి కావాలా, అమ్మాయి కావాలా" అన్నాను.

"ఎవరో ఒకరు, ఎప్పుడెప్పుడు ఈ బరువు కాస్త తీరిపోతుందాని రోజులు లెక్కేస్తున్నాను. చాలా ఆయాసంగా ఉంటున్నదే సీతా. ఏమిటో నాకు గుండెల్లో రాయి పడ్డది." అన్నది అక్కయ్య.

"ఎందుకని"

"ఈ పురుడు ఎట్లా వెళుతుందా అని. నామటుకు నాకు ఏమిటో అధైర్యంగా ఉంది." అన్నది అక్కయ్య దిగులుగా.

"ఏం"

"ఏమిటో చెప్పలేను. అబ్బ ఏం గంతులేస్తున్నాడే ఈ పొట్టలో. ఉండుండి ఒక్కసారి ఎగురుతున్నట్లుంది" అన్నది అక్కయ్య. నాకూ నవ్వొచ్చింది.

మరో రెండు రోజులు గడిచినయ్యి. అక్కయ్యకు కాస్త సన్న నొప్పులు ప్రారంభమైనయ్యి. బావ కాలేజీకి శలవు పెట్టారు. అన్నీ సమకూర్చుకుని అక్కయ్యను నర్సింగ్ హోంలో చేర్పించాం. ఉదయం పది గంటలకి నొప్పులు ప్రారంభమైతే సాయంత్రమయినా కాన్పుకాలేదు. అమ్మ కళ్ళనీళ్ళు పెట్టుకుని కూర్చుంది. బావ ఖంగారు పడపోగారు. నాకేం తోచటం లేదు. అక్కయ్యకూడా చాలా బాధ పడుతున్నది. కాన్పుల గదిలో నుంచి గంటయినా లేడీ డాక్టరు బైటికి రాలేదు. నర్సులు హడావుడిగా తిరుగుతున్నారు. ఎవర్నడిగినా ఏం చెప్పరు. లేడీ డాక్టరు బైటికొచ్చింది. ఆదుర్దాతో బావ, నేను వెళ్ళాం.

"మామూలుగా కాన్పు కాదు. కొలతలు తక్కువగా ఉన్నయ్యి. ఆపరేషన్ చేసి తియ్యాలి. ఆపరేషన్‌కు రెడీ అవుతున్నాను. ఏం భయపడకండి. అంతా సవ్యంగానే అవుతుంది" అని చెప్పి వెళ్ళి పోయింది. 'స్ట్రెచర్' మీద అక్కయ్యను ఆపరేషన్ గదికి తీసుకు వెళ్ళారు. హాల్లో నుంచి వెళుతుంటే అక్కయ్య కన్నీళ్ళతో బావకు నమస్కారం చేసింది. నా వైపు జాలిగా చూసింది. అమ్మ ఆ వరండాలోనే కుప్పన కూలిపోయింది. నాకూ దుఃఖం పొంగి పొర్లు కొచ్చింది. మనస్సులోనే ఎక్కు అవుకుని గుడ్లనీళ్ళు కుక్కుకున్నాను. బావ ముఖంలో కత్తి వేసినా నెత్తురుచుక్క లేదు.

ఆ వరండాలోనే తలో పక్కనా దిగాలు పడి కూర్చున్నాము. గంటసేపూ ఒక యుగంగా గడిపాము. నాలుక తడారిపోయింది.

గంటయాక నర్సు బయటి కొచ్చింది. సంతోషంగా చెప్పింది. "ఆపరేషన్ సక్సెస్‌ఫుల్‌గా అయింది. మగ పిల్లవాడు. చక్కగా పుష్టిగా ఉన్నాడు" అని.

సంతోషం పట్టలేక ఎగిరి గంతులేద్దామనిపించింది. అమ్మ ఆదుర్దాతగ్గి మెల్లిగా లేచికూర్చుంది. బావ చిరునవ్వుతో ముఖం తుడుచుకుంటూ నావైపు చూశారు. అందరి ఆదుర్దా తీరింది. మా మనస్సులు తేలిక పడ్డయ్యి లోపలికి వెళ్ళి చూసి వద్దామనుకున్నాం. అక్కయ్యకు ఇంకా తెలివి రాలేదంట, అందు

42 వ పేజీ చూడండి

## 30-10-1964 శుక్రవారము మొదలు 5-11-1964 గురువారము వరకు.

### మేషం :

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ప్రారంభంలో ప్రతి వ్యవహారమూ అనుకూలంగానే కన్పిస్తుంది గాని రానురాను అడుగడుగునా ప్రతిఘటనను ఎదుర్కోవలసి వస్తుంది. వృత్తి వ్యాపారాల్లో కార్యభారం పెరగడం వలన తీరిక లభించదు గాని అందువల్ల మీరు అదనంగా పొందే ప్రయోజనం యేమీ ఉండదు. మొగమాటాలకు పొగడ్తలకు లొంగి పోవడం వలన— వృత్తిలో నష్టానికి గురికాగల సూచనలు ఉన్నాయి. కోర్టు వ్యవహారాల్లో మరల చికాకులు రావచ్చును. ఆరోగ్య విషయంలో శ్రద్ధ అవసరం. సాహిత్య కళా రంగాల్లో మీ కృషికి ఆటంకాలు రావచ్చును. వజ్ఞాన సాంగత్యం ఆధ్యాత్మిక చింతన లభిస్తాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ కార్యక్రమాల్లో మార్పులు రాగల సూచనలు ఉన్నాయి. బంధు వ్యవహారాల్లో గౌరవం లభిస్తుంది.

1, 2 తేదీలు మంచివి కావు. మిగిలినవి మంచివి.

### వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగ 1, 2 పా.)

మీరు యెంత పొదుపుగా ఉందామని ప్రయత్నం చేసినా, కొన్ని వ్యవహారాల్లో అధిక వ్యయం చేయవలసిన పరిస్థితి యేర్పడుతుంది. కాని ప్రయత్నించిన ప్రతి వ్యవహారమూ ఫలించడం వలన మొత్తం మీద ఈ వారం సంతృప్తికరంగానే ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో ప్రముఖుల తోడ్పాటుతో అభివృద్ధిని సాధించగల సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో మీ పరిస్థితి ఇదివరకటి కంటే బాగా ఉన్నా, పూర్తిగా అనుకూలతను ఆశించలేము. మీరు ఇదివరకు చేసిన వాగ్దానాల వల్ల ఆర్థికంగా ఒత్తిడి రావచ్చును. ఆరోగ్యం బాగానే ఉంటుంది. ప్రేమ వ్యవహారాల్లో స్వల్పాభివృద్ధిని సాధించగలరు.

స్త్రీలకు— ఆరోగ్యం ప్రస్తుతం సామాన్యంగా ఉన్నా నిర్లక్ష్యం చేయరాదు. నూతన విషయాలను తెల్సుకొంటారు. అధిక వ్యయం జరుగుతుంది.

3, 4, 5 తేదీలు మంచివి కావు. మిగిలినవి మంచివి.

### మిథునం :

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు, 1, 2, 3 పా.)

వృత్తి వ్యాపారాల్లో నూతనావకాశాలు లభించక పోవచ్చును కాని మీ సమయస్ఫూర్తి వల్ల ఇప్పటి వ్యవహారాల్లోనే అధికాదాయాన్ని ఆర్జించగల అవకాశం ఉంది. ఏదో ఒక విధంగా డబ్బు యెప్పుడూ చేతికి అందడం వలన అన్ని వ్యవహారాలూ ఒడుదుడుకులు లేకుండా నెరవేరతాయి. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు కంటే స్వంతంగా చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఉద్యోగంలో

| మీ | మే | వృ | మి |
|---|---|---|---|
| | గు | | రా |
| శ | వారఫలం | | |
| | మహేష్ | | చం కు |
| కే | | ర బు | శు |

మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. పై అధికారుల ఆదరణా, అభిమానమూ, లభిస్తాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది.

స్త్రీలకు— ఆరోగ్యం గత వారంలో కంటే బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరతాయి. విలువైన వస్తువులు కొంటారు.

3, 4, 5 తేదీలు మిక్కిలి మంచివి. మిగిలినవి సామాన్యం.

### కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)

ఈ వారం ఆర్థికంగా సామాన్యంగా ఉన్నా అన్ని వ్యవహారాల్లోను గౌరవం పలుకుబడీ బాగా ఉంటాయి. మీ కంటే పెద్దవారు కూడా మీ అభిప్రాయాలను ఆలోచనలను ఆమోదిస్తారు. వృత్తి వ్యాపారాల్లో విశేషమైన మార్పులేమీ రావు. అధికారుల వలన జరగవలసిన పనులు సులువుగా నెరవేరతాయి. ముున్ముందు ప్రయోజనం గల పరిచయం లభిస్తుంది. ఉద్యోగంలో అన్ని వ్యవహారాలూ సక్రమంగా నెరవేరతాయి. కోర్టు వ్యవహారాల్లో అనుకూల వాతావరణం యేర్పడుతుంది. ఆరోగ్యం బాగా ఉంటుంది. రాజకీయ వ్యవహారాల్లో ప్రతి పక్షాల వారు కూడా మీ గొప్పతనాన్ని గుర్తించగలరు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. బంధు వ్యవహారాల్లో ఆందోళన కలగవచ్చును.

30, 31 తేదీలు మిక్కిలి మంచివి. మిగిలినవి సామాన్యం.

### సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

ఈ వారం గతవారం కంటె బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో మీరు తలపెట్టిన కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండ సాగిపోతాయి భారీ యెత్తున చేసే వ్యాపారాల్లో నూతనావకాశాలు లభించేటట్లు కన్పిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందక కొంత చికాకులు కలిగినా మీ వాక్చక్యం వల్ల యేదో ఒక విధంగా అన్ని వ్యవహారాలూ పరిష్కరించగలరు. వృత్తిలో ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగల సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో మీ పరిస్థితి బాగానే ఉంటుంది. ఆరోగ్య



> **సూచన**
>
> నూతన వ్యవహారాలు ప్రారంభించడానికి, ముఖ్యమైన నిర్ణయాలు చేయడానికి మంచివి అని వ్రాసిన తేదీలు అనుకూలంగా ఉంటాయి. మంచివి కాని తేదీల్లో అననుకూలమైన సంఘటనలు జరగడానికి అవకాశం ఉంది. కాబట్టి జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం.

విషయంలో జాగ్రత్త అవసరం. సాంఘిక వ్యవహారాల్లో ప్రయోజనం లేని బాధ్యత పెరుగుతుంది.

స్త్రీలకు— ఆరోగ్యం అంత బాగా ఉండక పోవచ్చును. మాట పట్టింపు వలన బంధు మిత్రులతో కలహ ప్రసంగం రావచ్చును.

3, 4, 5 తేదీలు సామాన్యం. మిగిలినవి మంచివి.

### కన్య :

(ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా)

ఈ వారం అంత బాగా ఉంటుందని ఆశించడానికి అవకాశం లేదు. మాట పట్టింపుల వలన లాభం వచ్చే వ్యవహారాలను కూడా పూర్తి చేయలేని పరిస్థితి యేర్పడుతుంది. మీరు ఇదివరకు జరిపిన వ్యవహారాల వల్ల ఇప్పుడు ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది. స్వంతంగా చేసే వ్యాపారాల కంటే భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు కొంచెం బాగా ఉంటాయి. వృత్తి ఉద్యోగాల్లో ఉన్నది నిలుపుకొంటే చాలుననే పరిస్థితి యేర్పడ వచ్చును. ఇతరులు చేసిన పొరపాటుల వలన మీరు అనవసరమైన శ్రమకు గురి కాగల సూచనలు ఉన్నాయి. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగానే ఉంటుంది. సాంఘిక కార్యక్రమాల్లో కొన్ని మార్పులు వస్తాయి. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు.

30, 31 తేదీలు మంచివి కావు. మిగిలినవి మంచివి.

### తుల :

(చిత్త 3,4 పాదాలు, స్వాతి, విశాఖ, 1,2,3 పా.)

ఈ వారం మీరు ఘన విజయాల్ని యేమీ సాధించ లేకపోయినా, వృత్తి వ్యాపారాలు మామూలుగా జరిగి పోవడం వలన ఫరవాలేదనే భావం కలుగుతుంది. ఇది వరకు ఏవో కారణాల వలన ఆగిపోయిన వ్యవహారాలు తిరిగి ప్రారంభం కావడం వలన కార్యభారం పెరుగుతుంది. నూతన వ్యాపారాలు అంత ప్రోత్సాహకరంగా ఉండవు. ఉద్యోగంలో మీ పరిస్థితి బాగానే ఉంటుంది. కోర్టు వ్యవహారాల్లో చాలా వరకు అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. రావలసిన డబ్బును గాని సహాయాన్ని గాని నమ్మి వాగ్దానాలు చేయడం వలన ముున్ముందు ఇబ్బంది కలుగుతుంది. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది.

స్త్రీలకు — ఆరోగ్యం గత వారంలో వలెనే ఉంటుంది. కుటుంబ కార్యక్రమాలు కొంత

శ్రమ మీద నెరవేరుతాయి. ప్రయోజనాలు పొందేదాకా వేచియుండడం మంచిది.

1, 2 తేదీలు మంచివి కావు. మిగిలిన మంచివి.

## వృశ్చికం :

**(విశాఖ 4—వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

వృత్తి వ్యాపారాల్లో మీరు ఊహించని సంఘటనలు కొన్ని జరగడం వలన మీ కార్యక్రమాలను మార్చుకోవలసిన పరిస్థితి యేర్పడ వచ్చును. అప్పుడు జరిగే మార్పుల వలన వెంటనే విశేషమైన ప్రయోజనం లేకపోయినా ముందుముందు చాలా ఉపయోగం ఉంటుంది. మీ మంచితనమే మీ అభివృద్ధికి ఆటంకం కాకుండా చూడడం చాలా అవసరం. ఏదో ఒక విధంగా డబ్బు యెప్పుడూ చేతిలో ఉండడం వలన అన్ని వ్యవహారాలూ బాగానే సాగి పోతాయి. ఉద్యోగంలో పైవారితో మాట పట్టింపులు రాగల సూచనలు ఉన్నాయి. ఆరోగ్యం బాగా వున్నా శరీర శ్రమతో కూడిన కార్యక్రమాలు పనికిరావు.

స్త్రీలకు— ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధించ గలరు. పుణ్యకార్యాలు చేస్తారు.

3, 4, 5 తేదీలు మంచివి కావు. మిగిలినవి మంచివి.

## ధనుస్సు :

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

ఈ వారం కూడా బాగానే వుంటుంది. వృత్తి వ్యాపారాల్లో ఇంతవరకు మీ పట్ల ఉదాసీనంగా ఉన్నవారు కూడా మీ అభిమానాన్ని సంపాదించు కోవడానికి ప్రయత్నం చేస్తారు. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా ఫలించగల సూచనలు ఉన్నాయి. భారి వ్యాపారాలకు సంబంధించిన యేర్పాట్లు ఒప్పందాలు చురుకుగా సాగుతాయి. వృత్తిలో అభివృద్ధి ఉంటుంది. ఉద్యోగంలో మీ ఆలోచనలు అమలు జరుపడానికి అవకాశం లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాల్లో క్రమంగా కొన్ని మార్పులు రావచ్చును. ఆరోగ్యం బాగానే ఉంటుంది. రాజకీయ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి.

స్త్రీలకు —ఆరోగ్యం బాగా ఉన్నా కొంచెం బల హీనత కన్పించ వచ్చును. సాంఘిక వ్యవహారాల్లో బాధ్యతా పలుకుబడి పెరుగుతాయి.

3, 4, 5 తేదీలు మిక్కిలి మంచివి. మిగిలినవి మంచివి.

## మకరం :

**(ఉషా 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1,2 పా.)**

ఈ వారం చిత్రంగా ఉంటుంది. మీ ఆలోచనలు అభిప్రాయాలు ఇతరుల వ్యవహారాల్లో బాగా పని చేస్తూ ఉంటాయి గాని మీకు మాత్రం వాటివల్ల అంతగా ప్రయోజనం ఉండదు. మీరు ఇదివరకు ఇతరులకు చేసిన వాగ్దానాలు ఇప్పుడు పూర్తి చేయడం వలన మానసికంగా సంతృప్తి లభిస్తుంది. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి. వృత్తిలో మార్పుల కోసం ప్రయత్నం చేయడం మంచిది కాదు. ఉద్యోగంలో మీ పరిస్థితి సాధారణంగా ఉంటుంది. మీకు అంతగా ఇష్టం లేని పనులు చేయవలసి వస్తుంది. స్వల్ప అనారోగ్య సూచనలు ఉన్నాయి.

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.

30,31,తేదీలు మంచివికావు. మిగిలినవిమంచివి.

## కుంభం :

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భా. 1, 2, 3)**

వారారంభంలో వృత్తి వ్యాపారాల్లో చికాకులు రావచ్చును కాని వారాంతానికి అన్ని వ్యవహారాలూ అనుకూలంగా ఉంటాయి. అధికారుల వలన జరుగ వలసిన పనులకు ఆటంకాలు రావచ్చును. వృత్తిలో ఇంత వరకు మీకు సహాయం చేస్తున్న వారికి కొన్ని ఇబ్బందులు రావడం వలన మీ కార్యక్రమాల్లో మార్పులు రావచ్చును. ఉద్యోగంలో మీ పరిస్థితి బాగానే ఉంటుంది. కాని ముఖ్యమైన నిర్ణయాలు ఇప్పుడు చేయడం మంచిది కాదు. ఆరోగ్యం అంత బాగా ఉండదు. రాజకీయ వ్యవహారాల్లో చాలా మార్పులు రావడం వలన మీరు యేమీ అభి వృద్ధిని సాధించలేరు.

స్త్రీలకు— బంధువులకు సంబంధించిన వ్యవహారాల్లో విజయాన్ని సాధిస్తారు. కుటుంబంలో స్వల్ప భేదాభిప్రాయాలు రావచ్చును.

1, 2 తేదీలు మంచివికావు మిగిలినవి మంచివి.

## మీనం :

**(పూ. భాద్ర, 4 పా, ఉ. రేవతి.)**

ఈ వారం శుభా శుభ మిశ్రమంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో ఆదాయం మామూలుగా ఉన్నా ఆందోళన మాత్రం అధికంగా ఉంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం రావచ్చును. ముఖ్యమైన వ్యవహారాలు భాగస్వాముల నిర్ణయానికి విడిచి పెట్టడం మంచిది. ఈ వారం మీరు జరిపే వ్యవహారాల్లో కొంత డబ్బు చిక్కుబడి పోయే ప్రమాదం ఉంది. వృత్తిలో పోటీ వారితో పోటీ పెరిగినా మీ కార్యక్రమాలకు ఆటంకం రాదు. ఉద్యోగంలో మీ పరిస్థితి సాధారణంగా ఉంటుంది. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కాని దూర ప్రయాణాలు చేయడం మంచిది కాదు.

స్త్రీలకు— ఆరోగ్యం అంత బాగా ఉండక పోవచ్చును. కుటుంబ వ్యవహారాలు ఇది వరకటికంటె బాగా ఉంటాయి. బంధు మిత్రులను కల్సుకొంటారు.

1, 2 తేదీలు మంచివి. మిగిలినవి మంచివి కావు.

★

# జన్మదిన ఫలం

## అక్టోబరు-30

ఈ సంవత్సరం మొత్తంమీద బాగానే ఉంటుంది గాని అప్పుడప్పుడు ఆందోళన కలిగించే పరిస్థితులు పైవారితో భేదాభిప్రాయాలు మొదలైనవి కలగవచ్చును. వృత్తి వ్యాపారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. గత సంవత్సరంకంటె ఆదాయం బాగా ఉంటుంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాల్లో క్రమంగా ప్రోత్సాహం లభిస్తుంది. ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు రావడానికి అవకాశం ఉంది. బంధుమిత్రులతో కలహ ప్రసంగం రాగల సూచనలు ఉన్నాయి. కాబట్టి వాద ప్రతివాదాలకు దిగడం మంచిదికాదు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో ఒడుదుడుకులు రావచ్చును. సంతానానికి అనారోగ్యం చేస్తుంది. ప్రేమ వ్యవహారాల్లో అకస్మాత్తుగా చికాకులు రావచ్చును. దూరప్రయాణాలు చేస్తారు. విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కాగలరు. పారిశ్రామికవేత్తలకు యోగవంతమైన సమయం.

## అక్టోబరు-31

ఈ సంవత్సరం గత సంవత్సరంకంటె బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో ఇంతవరకు ఏర్పడి ఉన్న చికాకులు క్రమంగా తగ్గుముఖం పట్టడంవలన సంవత్సరం మధ్యకు క్రమాభివృద్ధి సాధించగలరు. స్వంతంగాచేసే వ్యాపారాలకంటె భాగస్వాములతో కలిసిచేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు సంవత్సరము రెండవ భాగంలో ఫలిస్తాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయిగాని ఫలితం సామాన్యంగా ఉంటుంది. ఉద్యోగంలో మీ పరిస్థితి బాగానే ఉంటుంది. స్థిరాస్థి వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. రాజకీయ రంగంలో నూతన గౌరవాన్ని పొందుతారు విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు

## నవంబరు-1

ఈ సంవత్సరం అన్ని వ్యవహారాల్లోను చాలా జాగ్రత్తగా ఉండవలసి సమయం. వృత్తి వ్యాపారాల్లో ప్రతిక్షణం ఏదో ఒక సందేహం కలుగుతూ ఉండడంవలన సాహసించి ఏ పని చేయలేరు. వ్యాపారంలో మీ అశ్రద్ధవల్ల కొన్ని అవకాశాలు చేజారిపోయే ప్రమాదం ఉంది. భారీయెత్తున చేసే వ్యాపారాలు కొంతకాలంపాటు వాయిదా వేయడం మంచిది. వృత్తిలో స్వల్ప వ్యవహారాలకుకూడా విశేష ప్రయత్నం చేయవలసిన వస్తుంది. ఉద్యోగంలో అననుకూలమైన వాతావరణం ఏర్పడుతుంది. మీకు వ్యతిరేకంగా ఒక ఉద్యమం వంటిది రావచ్చును.ఆరోగ్యం బాగాఉన్నా కాలడం,జారిపడడం వంటి ప్రమాదాలు కలగవచ్చును. కుటుంబ వ్యవహారాలు బాగానే ఉంటాయి. శుభకార్యాల విషయంలో కొంతశ్రమమీద అనుకూలత లభిస్తుంది.విద్యార్థులు శ్రమమీద సాధారణంగా కృతార్థులు కాగలరు.

## నవంబరు-2

ఈ సంవత్సరం సామాన్యంగా ఉంటుంది. ప్రారంభంలో మీరు ఎంతదూరంగా ఉందామనుకొన్నా పరిస్థితుల ప్రభావంవల్ల మీకు ఇష్టం కాని వ్యవహారాల్లో తలదూర్చవలసిన స్థితి ఏర్పడుతుంది. వృత్తి వ్యాపారాలకు సంబంధించిన వ్యవహారాల్లో కోర్టువరకు వెళ్లవలసిన అవసరం ఏర్పడగల సూచనలు ఉన్నాయి. అధికారులవలన జరుగవలసిన పనులకు ఆటంకాలు వస్తాయి. రావలసిన డబ్బు కూడా చేతికి వచ్చేవరకూ నమ్మడానికి వీలులేదు. వృత్తిలో పోటీవారితో పోటీ పెరగటంవలన్న విశ్వ ఇప్పటి స్థానాన్ని నిలబెట్టుకొనడానికి శ్రమ పొందక

# జన్మదినఫలం

వలసివస్తుంది. ఉద్యోగంలో స్థానచలనం కలిగే వచ్చును. ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం. కుటుంబ వ్యవహారాల్లో భేదాభిప్రాయాలు రావడం వలన కొన్ని కార్యక్రమాలు నిలచిపోవచ్చును. విద్యార్థులు మొదటనుంచీ శ్రద్ధగా చదవడం మంచిది.

## నవంబరు-3

ఈ సంవత్సరం ప్రారంభంలో సామాన్యంగా ఉన్నా రానురాను అన్ని వ్యవహారాలలోను అనుకూలత లభిస్తుంది. వృత్తివ్యాపారాల్లో తీవ్రమైన పోటీని ఎదుర్కొన్న తరువాత విజయాన్ని సాధించడంవలన అధికాదాయాన్ని పొందడమే కాకుండా పోటీవారిలో గౌరవంకూడా పొందగలరు. దీర్ఘకాలానికి ఫలితాన్ని ఇచ్చే వ్యాపారాలు ప్రారంభించడానికి మంచి సమయం. వృత్తి ఉద్యోగాలకు సంబంధించిన విద్యలో ఉత్తీర్ణులు కాగలరు. ఉద్యోగంలో మీరు కోరే మార్పులకోసం ప్రయత్నం చేయువచ్చును. కోర్టు వ్యవహారాల్లో మీరు ఆశించినంత ప్రయోజనాన్ని పొందలేరు. గాని పరాజయ ప్రమాదంలేదు. ఆరోగ్యం బాగానే ఉంటుంది. రాజకీయ వ్యవహారాల్లో నూతన పరిణామాలు కలగడంవలన ఇదివరకు శత్రువులుగా ఉన్నవారుకూడా మిత్రులు కాగలరు. విద్యార్థులు మంచిమార్కులతో కృతార్థులు కాగలరు.

## నవంబరు-4

ఈ సంవత్సరం ఏ వ్యవహారం ఎలాగ ఉన్నా ఆర్థికంగా మాత్రం బాగానే ఉంటుంది. వృత్తివ్యాపారాల్లో మీరు వూహించని మార్పులు రావడం వలన సంవత్సరం మధ్యభాగంలో మీ కార్యక్రమాలకు మార్పులు రావచ్చును. ఇంతవరకు కొన్ని వ్యవహారాల చిక్కుల్లో ఉండిపోయిన డబ్బు కూడా ఇప్పుడు చేతికి వస్తుంది. కొంతమంది స్నేహితులకు మీరు సహాయం చేయడంవలన అప్పుడప్పుడు ఆర్థికంగా ఒత్తిడికి గురి కాగలరు. వృత్తిలో ఆదాయం గౌరవం కూడా బాగా ఉంటాయి. ఉద్యోగంలో మీ పరిస్థితి బాగానే ఉంటుంది. ఆరోగ్యం కూడా బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలన్నీ సక్రమంగా నెరవేరతాయి. ఇంతవరకు భిన్నాభిప్రాయాలుగల బంధువులను ఒక దారికి తీసుకొని రాగలరు. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. విద్యార్థులు సాధారణంగా కృతార్థులుకాగలరు.

## నవంబరు-5

ఈ సంవత్సరం పూర్తిగా అనుకూలతను ఆశించడానికి అవకాశంలేదు. అకారణంగా మీకు కలిగే సందేహాలవలన లాభంవచ్చే వ్యవహారాలను కూడా విడిచిపెట్టి తరువాత పశ్చాత్తాప పడతారు. కొంతమంది బంధులు తమ వ్యవహారాల్లో మిమ్మల్ని ఒక సాధనంగా వినియోగించుకోవడానికి ప్రయత్నం చేస్తారు. వృత్తిలో సామాన్య వ్యవహారాలకు కూడా విశేషమైన వ్యయం చేయవలసి వస్తుంది. మీరు వృత్తి, ఉద్యోగాలరీత్యా చేసే ప్రయాణాలవల్ల అంతగా ప్రయోజనం ఉండదు. కోర్టు వ్యవహారాల్లో ఇంతవరకు ఉన్న వ్యతిరేకత చాలవరకు తొలగిపోతుంది. జీర్ణసంబంధమైన అనారోగ్యం చేయువచ్చును. కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. స్త్రీ మూలకంగా కలహప్రసంగం రావచ్చును. విద్యార్థులు చాలా శ్రమమీద కృతార్థులు కావచ్చును. ★




# అమృతాంజనం

## వాడి శీఘ్రంగా నివారణ పొందండి

స్థానికంగా ఉండే బాధను నివారణ చేసుకోడానికి ఊరికే మందులు ఎందుకు పుచ్చుకుంటారు? నొప్పి ఉన్న చోటుమీద అమృతాంజన్ రాసి అమోఘంగా శీఘ్రంగా నివారణను పొందండి. ఏ అపాయం లేకుండా బెణుకులకు కండరాల నొప్పులకు తలనొప్పికి ఇంకా కీళ్ల నొప్పులకు అమోఘంగా గుణమిచ్చే అమృతాంజన్ 10 రకాల ఔషధాలు చేరిన మందు. అమృతాంజన్ గుండెజలుబుకు సాధారణ జలుబులకు కూడా మంచి మందు. కొంచెం కొంచెమే ఉపయోగించవలసి ఉంటుంది. కాబట్టి ఒక సీసా మీ కుటుంబానికంతా కలిసి నెలలు తరబడి వస్తుంది. అవసరానికి ఎప్పుడూ అమృతాంజన్ ఉంచుకోండి. అమృతాంజన్ 70 ఏళ్ల ప్రసిద్ధిని పొందిన నమ్మకమైన గృహ ఔషధం.

**అమృతాంజన్ నొప్పుల జలుబుల నివారణకు 10 రకాల ఔషధాలు చేరిన మందు**




అమృతాంజన్ లిమిటెడ్.
మద్రాసు • బొంబాయి • కలకత్తా • ఢిల్లీ

JWT/AM/28168

మా వూళ్ళో ఉంటే శంకరరావుగారెవరని అడిగే వారుకారు వీరారు. అంటే మాది చిన్న వూరాకాదు ఏంతమాత్రం ! చాలా పెద్దది. కొన్ని లక్షల జనాభా. రోజూ వచ్చిపోయేవారు. నిజంగానే పెద్ద వూరు. శంకరరావుగారు వ్యాపారంచేసేవారు. వ్యవసాయం చేసుకునేవారు. మా వూరి రాజకీయా లలో చెయ్యి ఉంది. అటువంటి పెద్దమనిషి పరిచయం నాలాంటి ఉపాధ్యాయుడికి అవసరం రావ టంలో ఆశ్చర్యమేముంది ? ఆయన పిల్లలు కొందరు నా దగ్గర చదువుకున్నారు కూడా.

ఒకరోజు కబురు సంపారాయన. వీలుదొరగ్గానే ఆయన ఇంటికెళ్ళాను. ఉదయం ఎనిమిది కావొచ్చే సమయం. వరండాలో పడక కుర్చీలో కూర్చుని ఏదో ఆలోచిస్తున్నారు. నన్నుచూడగానే ఆప్యాయంగా పలకరించి కూర్చోపెట్టారు. కప్పు కాఫీ తెప్పిం చారు. ఇవీ అవీ మాట్లాడుకుని అసలు విషయానికి వచ్చాము.

శంకరరావుగారికి మొత్తం ఆరుగురు సంతానం. మొదటి ముగ్గురూ అమ్మాయిలే. తర్వాత ఇద్దరు అబ్బాయిలు. ఆ తర్వాత అమ్మాయి పుట్టారు. చివరి అబ్బాయీ, అమ్మాయీ తిద్దరికి పెళ్ళిళ్ళు కావలసి ఉన్నాయి. ముందు ఆడపిల్ల పెళ్ళి చేసెయ్యాలని శంకరరావుగారు తొందరపడుతున్నారు. ఎన్నో సంబంధాలు చూస్తున్నారు. అందులో కొన్ని వీళ్ళకి నచ్చకా,కొన్ని వాళ్ళకి నచ్చకా తప్పిపోతున్నాయి. ఇలా ఉండగా ఎవరో ఆయనకి ఒక అబ్బాయి గురించి చెప్పారు. ఆ అబ్బాయి ఒక విధంగా ఆయ నకి దూరపు చుట్టం. ప్రస్తుతం నేనున్న కాలేజీ లోనే ఎసిస్టెంట్ లెక్చరర్‌గా పనిచేస్తున్నాట్ట.

మాధవరావు బాటనీ డిపార్టుమెంటులో ఉంటు న్నాడు. కుర్రాడు, తెలివయినవాడు, మంచివాడు లానే కనిపిస్తాడని శంకరరావుగారితో చెప్పాను. చూడటానికి బాగానే ఉంటాడని నా అభిప్రాయం అన్నాను. వయసు, శంకరరావుఅనుకున్నట్టే పాతిక లోపుగానే ఉంటుందని అంగీకరించాను.

"ఈ విషయంలో నీ సహాయం కావాలి రావు గారూ !" అన్నారు శంకరరావు.

* * *

మాధవరావుని వెంటాడేవారి సంఖ్య పెద్దది గానే ఉన్నా శంకరరావుగారి విషయం చెప్పేసరికి అతను కొంచెం ఆశ్చర్యపోకపోలేదు. "ఏమిటి ఆయన మావాడా ?" అని అడిగాడు. అన్ని వివ రాలూ తెలియజేశాను. ఆలోచించి చెప్తానన్నాడు.

"ఎన్ని రోజుల్లో" అని ప్రశ్నించారు శంకరరావు గారు నేనా వార్త అందచేసినప్పుడు. వీలయినంత తొందర పెట్టగలనని చెప్పాను. నేనుండగానే వారి అమ్మాయిని పిలిచారు. పేరు శకుంతల. ఇరవై ఏళ్ళకన్నా ఎక్కువ ఉండదు. కొంచెం— అతి కొంచెం— సన్నగా ఉంటే మామూలుకన్నా ఎక్కువ అంద గత్తెనని చెప్పినా అతిశయోక్తి కానేరదు. కిందటి సంవత్సరమే బి. ఎస్. సి, జాగ్రఫీ పూర్తిచేసి వూరి కనే ఉంది. నా క్లాసులో ఎప్పుడూ కూర్చోలేదు కాని నాకు బాగా తెలుసు.

మాధవరావు అంతగా ఆమె దృష్టిలో పడలేదు. తన స్నేహితురాలెవరో బాటనీ చదువుతూ ఉండేదనీ మాధవరావుని గురించి ఎప్పుడో చెప్పినట్టు జ్ఞాపక మని అంది. అసలా నేనే విషయం నిలదీసి కడుపు తున్నామో శకుంతలకి తెలియకపోలె దనుకుంటాను. కాని, నేరుగా 'ఎట్లా ఉంటాడ' ని అడిగేదాకా సిగ్గు పడే అవకాశం ఆమెకి రాలేదు. చివరికి ఆ ప్రశ్న కాస్తా అడిగేటప్పటికి ఆమె కొంచెం కంగారుపడి ఏటూ చెప్పకుండా వెళ్ళిపోయింది. ఇదీ ఒక రకమయిన లజ్జా ప్రదర్శనేమో అనుకున్నాను నేను. శంకరరావుగారు అసలు ఇదంతా గమనించినట్లు లేదు. ఏదో ఆలో చిస్తూ, అబ్బాయి జాతకం సంపాదించిపెట్టమన్నారు.

* * *

నేను వెంటనే మాధవరావుని కలవటం వీలు లేక పోయింది.అతను అవసరంగా వారం రోజులు సెలవు పెట్టి ఇంటికి వెళ్ళిపోయాడని, మర్నాడు కాలేజీకి వెళ్ళినప్పుడు తెలిసింది. అతనిది నెల్లూరు దగ్గరే ఉన్న చిన్న వూరు. తండ్రి లేడు. తల్లి ఇతని అన్న గారితో ఉంటోంది. ఆయనా మాలాగే ఉపాధ్యాయ వృత్తిలో ఉన్నాడని నా విచారణలో తెలిసింది. వీరిద్దరు తప్ప వీరి తల్లిదండ్రులకి వేరే సంతానం కలగలేదుట. హడావుడిగా వెళ్ళినవాడికి జాతకం పంప మంటూ ఉత్తరం వ్రాయటం బాగుండదని, వచ్చిన తర్వాతనే అడగటానికి నిశ్చయించుకున్నాను. ఆమాటే శంకరరావుగారికే వెళ్ళి చెప్పాను. నేను తిరిగి మా ఇంటికి వచ్చేసరికి ఏడు గంటలు దాటింది. వసారాలో నాకోసమే ఎదురుచూస్తూ కూర్చున్నట్టు కనిపించిన కుర్రాడొకడు నేను రాగానే లేచి నుంచుని, "నమ స్కారం మాస్టారూ !" అన్నాడు చేతులు రెండూ జోడిస్తూ. ఎక్కడో చూసినట్లుంది కాని ఎవరో గుర్తుపట్టలేకపోయాను.

"నేనండీ, కామరాజుని ! పోయినేడు కాలేజి హాకీ కాప్టెన్‌ని, ఎకనామిక్స్ ఎం. ఎ. చదివాను, జ్ఞాపకం లేదూ ......"

"ఓహోహో ! నువ్వటోయ్ కామరాజూ ! ఎవరో అనుకున్నాను ! కూచో ఇప్పుడే వచ్చేస్తాను."

తిరిగి వచ్చిన తర్వాత అతన్ని గురించి అడిగాను. కామరాజుది అసలు ఆ వూరే. కాని అతని చిన్నప్పుడే వాళ్ళ కుటుంబం గుంటూరులో స్థిరపడిపోయింది. అక్కడ అతని తండ్రి పొగాకు వ్యాపారం చేసేవాడు. కామరాజు ఎం. ఎ. మావూళ్ళో చదివాడు. హాకీలో ఇంతో అంతో పేరు సంపాదించుకున్నాడు. కథలు కూడా వ్రాసేవాడు. మా కాలేజి మాగజయిన్‌లో ఒకటి పడినట్లు నాకు లీలగా గుర్తు. ప్రస్తుతం మావూరి పొలిమేరలో ఉన్న ఒక పెద్ద సిమెంటు కంపెనీలో మంచిపనే దొరికితే చేరాట్ట.

"వూరికేనే చూసిపోదామని వచ్చా...." అని నీళ్ళు నమిలాడు కాని కొంతసేపు తర్వాత అసలు సంగతి బయటపెట్టాడు.శంకరరావుగారికూతురు శకుంతలని



"చూడుబాబూ ! ఏం చదువుకున్నావ్? బయటరోడ్డుగోడ్లు నగల వ్యాపారం అని తాటికాయలంత అక్షరాల బోర్డు చూడలేదా ?

'ఆంధ్రసచిత్ర వారపత్రిక'లో ప్రచురణకు ఇండియన్ ఇంక్‌తో వేసిన కార్టూనులు మాత్రమే పంపాలి. సాధారణంగా 4''×2'', 4''×4'' చిత్రాలు పత్రికలో పడుతూ ఉంటాయి.



# త్యాగం

వివాహం చేసుకొందామనుకొన్నాట్ట. తనంటే ఆమెకి కాలేజీలో చదివేరోజు అప్పటినుంచీ అభిమానంట. ఒకసారి తను హాకీ ఆడుతూ ఉంటే విపరీతంగా చప్పట్లు కొట్టడం గమనించాడుట. కథా రచయిత అని అభిమానం కూడా ఉండేదిట. ఒకసారి అతని 'ప్రణయ స్వరూపం' అనే కథ పడ్డ పత్రికకి 'కథ చాలా బాగుంది, రచయితకు అభినందనలు' అని ఉత్తరం రాసిందట. అంతేకాక, తను 'ప్రేమ్‌కుమార్' లాగ ఉంటాడని మెచ్చుకుందని విశ్వసనీయమైన వ్యక్తుల ద్వారా విన్నాట్ట.

"ప్రేమ్‌కుమారా? మన ఛాంపియన్ గారబ్బాయా? అతను లావుగా పొట్టిగా ఉంటాడు కదూటోయ్? నువ్వేమో పొడుగ్గా, సన్నగా ...." అని సందేహం వెలిబుచ్చాను. కామరాజు నా సందేహాన్ని శీఘ్రంగా నివృత్తి చేశాడు. ప్రేమ్‌కుమార్ ఒక సుప్రసిద్ధ హిందీ నటుడుట.

ఇంతకీ కామరాజు నన్ను కోరదలుచుకున్న 'సహాయమల్లా' శంకరరావుగారిని తన విషయంలో సుముఖుడిని చెయ్యటం. కామరాజు కుటుంబానికీ శంకరరావుగారి కుటుంబానికీ బద్ధ వైరంట. కుటుంబ కలహాలు వ్యాపార కలహాలుగా కూడా మారి ఒకరికొకరు చాలా దూరమయిపోయారుట. కామరాజు తల్లి చిన్నప్పుడే పోయిందిట. తండ్రి నిరుడు పోయాడట. అయినా శంకరరావుగారికి కోపం పోలేదుట. కోర్టులో ఇంకా ఏదో కేసు జరుగుతూనే ఉన్నట్టు కామరాజు చెప్పేడు.

"బాబూ, కామరాజూ! నువ్వు చెప్పిందంతా బాగానే ఉంది. నా సానుభూతికేం తక్కువలేదు. అయితే శంకరరావుగారి దగ్గర నాకంత చనువు లేదు. సంబంధం చూసిపెట్టమంటే ఏదో అవస్థపడుతున్నా కాని 'పేచీలో' దిగటం నాకు భయం. అసలు నేను నీకేవిధంగా సాయం చెయ్యగలనో చెప్పు!"

నా మాటలకి కామరాజు నిరాశ చెందినట్టు కనిపించడు. అయినప్పటికీ కోలుకుని తన అభిప్రాయం చెప్పాడు. శంకరరావుగారికి తగిన సిఫార్సు, తన తరఫున చెయ్యమన్నాడు. నేను తికమకపడి, చూస్తానని పంపించివేశాను.

రెండు రోజుల తర్వాత శంకరరావుగారు హఠాత్తుగా మా యింటికి వచ్చేశారు. ఇది నేను ఎదురు చూడని సంఘటన. ఆశ్చర్యంతోనే ఆయన్ని ఆహ్వానించాను. శంకరరావుగారు కొంచెంసేపు తటపటాయించి ఒక ఉత్తరం నా చేతికి ఇచ్చారు.

అది కామరాజు శకుంతలకి వ్రాసిన ప్రేమలేఖ. అందులో మామూలు భావ ప్రకటనలే కాక నా పేరు ప్రస్తావన కూడా ఉండటం చూసి భయపడ్డాను. నేను సహాయం చెయ్యగలనని ధైర్యం తనకున్నదని కామరాజు వ్రాశాడు.

శంకరంగారు లౌక్యుడు, నిలకడ మనిషి. తొందరపడి ఏమీ అనుమానించలేదు, దూషించలేదు. ఆ ఉత్తరం ఆయనకి అనుకోకుండా దొరికిందట. తన కుమార్తెని అడగనయినా లేదుట. నేరుగా నా దగ్గరకి వచ్చేశాడు. నేను చెప్పినదంతా జాగ్రత్తగా విన్నాడు.

"ఇప్పుడిక నా కెటువంటి అనుమానమూ లేదని

చెప్పగలను. ఇక కామరాజు విషయ మంటారా, మా కుటుంబాల మధ్య విరోధాలు ఇంకా తగ్గ లేదు. ఈ పరిస్థితుల్లో ఈ వివాహం జరగటానికి వీల్లేదు ! అదీకాక కామరాజు మా అమ్మాయికి తగ్గ వాడేనా అనే అనుమానమూ లేకపోలేదు. ఇంత దూరం వచ్చింది కాబట్టి చెపుతున్నాను. మాధవ రావు విషయంలో మీరు మరింత శ్రద్ధ చూపమని కోరిక ! మీరు అశ్రద్ధ చేస్తున్నారని కాదనుకోండి.''

శంకరరావుగారు వెళ్ళిపోయిన తర్వాత నిదానంగా ఆలోచించి చూశాను. కామరాజుపట్ల సానుభూతి ఉన్నా, అనవసరంగా నన్ను తన ప్రేమ వ్యవహారాల్లోకి ఈడ్చినందుకు అతనిమీద కొంచెం చిరాకు కలిగింది. శంకరరావుగారు సామాన్యులుకారు. ఆయనతో వైరం నాకు మంచిదికాదు. అలాగని ఆయనతో కూడి ఆయన కుమార్తెకి ఇష్టంలేని పెళ్ళి బలవంతంగా చేయించటమూ నా కిష్టంలేదు —శకుంతల వింత ప్రవర్తన వెనుక దాగిఉన్నది ఇప్పుడు బయటపడింది కదా, అనుకున్నాను. కొంచెం ఉదాసీనంగా ఉండటం మంచిదనిపించింది.

నాలుగురోజులు గడిచాయి నేను శంకరరావుగారిని మళ్ళీ కలుసుకోలేదు. నాకు సంబంధించినంత వరకూ ఈ విషయం వెనకబడినట్లే ననుకుని ఎంతో సంతోషించాను. ఒకనాడు సాయంత్రం నేనలా కాలవగట్టు వెంబడే నడిచి వెళుతున్నాను. కామరాజు నాకెదురుగా నడిచివస్తూ కనిపించాడు. నేను సందిగ్ధావస్థలో పడ్డాను. తప్పించుకుందామా అనుకుంటూ ఉండగా మా చూపులు కలిశాయి. ఇక లాభంలేదనుకుని చిరునవ్వుతో పలకరించాను. కామరాజు ఏదో చెప్పబోయి వూరుకున్నాడు. కొన్ని కుశలప్రశ్నలు, ఇతర విశేషాల చర్చలూ అయిన తర్వాత నానద్ద సెలవు పుచ్చుకున్నాడు. తన ప్రేమ వ్యవహారం ఎక్కడ మొదుపుతాడో అని నేను భయపడ్డాను. కాని, అతను ఆపని మాత్రం చెయ్యలేదు. దీనికి కారణమేమయి ఉంటుందా అని ఆలోచించి చూశాను కాని, అంతుపట్టలేదు,

మర్నాడు మా ప్రిన్సిపాలుగారు నాకు కబురు పంపి చెప్పారు. ఒక మంత్రిగారు వూళ్ళోకి వచ్చారనీ, శంకరరావుగారి ఇంట్లో దిగారనీ, మేమిద్దరం వెళ్ళి వెంటనే ఆయన్ని చూడవలసి వస్తుందనీ, మంత్రిగారు సాయంత్రమే కారుమీద ఇంకెక్కడికో వెళ్ళిపోతారుట. అంతలోపల ఆయన్ని చూడటం అవసరం. ఇంతకీ ఈ మంత్రిగారు నాతోబాటే స్వాతంత్ర్యోద్యమంలో జయిల్లో ఉన్నారు. ఆయన్ని చూస్తే మా ప్రిన్సిపాలుగారికి బెరుకు. నాతోడు అవసరం అనుకుంటారు—నిజానికి మంత్రిగారితో నాకు పెద్ద చనువు లేకపోయినా.

ఇద్దరం ఆయన కార్లో శంకరరావుగారి ఇల్లు చేరుకున్నాము. మా దురదృష్టవశాత్తు మంత్రిగారు అప్పుడే కలెక్టరుగారితో బయటికి వెళ్లారుట. గంటసేపయినా అవుతుందిట తిరిగి రావటానికి. అప్పటికి పదకొండున్నర దాటింది. పన్నెండుకి ప్రిన్సిపాలుగారికి క్లాసుంది. కొంచెం తర్జనభర్జన జరిపిన తర్వాత, ఆయన కాలేజికి తిరిగి వెళ్ళిపోయేటట్లూ, నేను అక్కడే ఉండి మంత్రిగారు రాగానే టెలిఫోన్ చేసేటట్లూ నిశ్చయించుకున్నాము.

శంకరరావుగారితో ఒంటరిగా మిగిలిపోయాను. కొంతసేపటికి ఆయనే తన కూతురు పెళ్ళి ప్రసక్తి తెచ్చారు.

''కామరాజేమయినా కనిపించాడా ? ఏమంటున్నాడు ?'' అని అడిగారు. అప్పుడు ఆయన ముఖంలో నవ్వు రేఖలు మెరిసి మాయమయ్యాయి. నేను అంత క్రితం కామరాజుని కలుసుకున్న సంఘటన గురించి చెప్పాను.

''ఇక మన జోలికి రాడులెండి !'' అని పూరుకున్నా రాయన. నేనూ ఆయన్ని ఇంకేమీ అడగలేదు. మాధవరావు జాతకం గురించి జ్ఞాపకం చేశారు. ఇంతలో మంత్రిగారు అనుకోకుండా తిరిగి రావటం ప్రిన్సిపాలుగారికి టెలిఫోను చెయ్యటం వగైరాలు జరిగాయి.

రాత్రి భోజనంచేసి ఏదో చదువుకుంటూ ఉండగా కామరాజు వచ్చాడు.

''మాస్టారూ నేను చాలా దురదృష్టవంతుణ్ని, అన్నాడు. ఏమిటని అడగ్గా చెప్పాడు. అంతకి రెండు రోజులు ముందు, ఉదయమే అతను ఉండే అద్దె ఇంటి వాకిట్లో ఒక వ్యక్తి వచ్చి నుంచుని ఉండటం చూసి ఎవరని అడిగాడుట తను. ఆవ్యక్తి తలపాగా, కోటూ, పై జామాలు వేసుకుని ఉన్నాడుట. ఇంగ్లీషు ఉచ్చారణనుబట్టి ఉత్తర హిందూదేశానికి చెందిన మనిషిలాగ కనిపించాడుట. ''నీ అదృష్టం అమోఘంగా ఉంది, నువ్వు తప్పకుండా విదేశాలకి వెడతావు, నీది ఉజ్వల భవిష్యత్తు'' అని మొదలు పెట్టి ''అయితే వివాహంలో గండం!'' అని ఆగిపోయాడుట ఆ వ్యక్తి ఇంగ్లీషులో.

కసిరి పంపించెయ్యటానికి సిద్ధపడుతున్న కామరాజు ఈ చివరి వాక్యం వినగానే ఇంకా చెప్పమని అడిగాడుట. ఆ జోస్యుడు కామరాజు మొహం పరీక్షగా చూసి అతని జాతకం వివరాలన్నీ చెప్పాడుట. తర్వాత 'శ' అనే అక్షరంతో పేరు ప్రారంభమయి, బంధువర్గానికే చెందిన ఒక ఎర్రని అమ్మాయితో పెళ్ళి అయే ప్రమాదం ఉందనీ, ఆ పెళ్ళి గనక జరిగితే ఆరు నెలల్లో అగ్నిప్రమాదంలో ప్రాణం కోల్పోయే అవకాశం — అవకాశ మేమిటి, నిశ్చయం !—ఉందని చెప్పాడుట.

''నాకు జ్యోతిషం అంటే నమ్మకంలేదు మాష్టరూ, కాని శకుంతలకి అన్యాయం జరగటం ఇష్టంలేదు ! ఆమెకోసం త్యాగం చేస్తున్నాను. ఇక ఆమెని మరచిపోతాను !'' అని గంభీరంగా చెప్పాడు నాతో కామరాజు. కాలవగట్టుమీద కలిసినప్పుడు చెబుదామనుకుని కూడా చెప్పలేదుట. అతని నిర్ణయాన్ని మెచ్చుకోకుండా ఉండలేకపోయాను. కాలం ఎటువంటి గాయాన్నయినా మానుస్తుందన్న సామెతని వల్లె వేశాను.

* * *

నా వృత్తి హడావుడిలో ఈ విషయాలన్నీ మరిచిపోయాను. మాధవరావు సెలవు అయిపోయింది గావును, హఠాత్తుగా మా 'స్టాఫ్‌రూమ్' లో కనిపించాడు. నవ్వుతూవచ్చి ఒక కవరు నా చేతో పెట్టాడు. పసుపు మరకలు శుభలేఖని సూచించాయి. ''అనుకోకుండా పెళ్ళి కుదిర్చేసిందండీ మా అమ్మ ! ప్రిన్సిపాల్‌గారితో కూడా చెప్పాను. మంచాయన, మళ్ళీ వచ్చే నెల సెలవు ఇప్పిస్తానన్నారు !'' అన్నాడు.

నాకు నిజంగా సంతోషం కలిగింది. మాధవరావుని అభినందించాను.

* * *

ఇదంతా జరిగినవారం పదిరోజులకి నేనేదో పనిమీద మున్సిపల్ ఆఫీసుకు వెళ్లాను. అక్కడ 'బర్త్స్ ఎండ్ డెత్స్' శాఖలో పనిచేసే మా చుట్టం ఒకతను కనిపించగా కబుర్లలోకి దిగాము.

''అన్నట్టు బాబాయి ! ఆమధ్య శంకరరావుగారి తాలూకు పెద్దమనిషెవరో వచ్చి తమ యజమానిగారి చుట్టాలబ్బాయి పుట్టిన తేదీ సమయం మొదలైన వివరాలన్నీ రాసుకెళ్ళాడు. కోర్టు వ్యవహారాలా ? సంబంధాలకి జాతకాలేమయినా వేయిస్తున్నాడా ?'' అని అడిగాడు మావాడు.

''పంజాబీ వాడెవడయినా కూడా వచ్చాడా ?'' అని నేను వేసిన ఎదురుప్రశ్న అతనికి అర్థం కాలేదు. ★




''నాయనా! నీమనసులో ఉద్యోగం దొరుకుతుందా, దొరకదా అనే సందేహంతో నీవు సతమతమవుతున్నావు! ఔనా?...''

## భారీ యెత్తున దేశరక్షణకు
## ప్రకాళికాబద్ధమైన అభివృద్ధి అవసరం

రెండవ భాగం

# "నేను సైతాన్ చేతుల్లో బానిసను"

హాడ్ డిబ్బెన్

ఒక రోజు నాకు టెలిఫోన్ వచ్చింది. ఎవరో వ్యక్తి సైతాన్ సంఘం వదిలితే ఏమవుతుందో గుర్తుంచుకోమని చెప్పాడు.

మా నాన్న హఠాత్తుగా మరణించవచ్చునని నన్ను హెచ్చరించిన సంగతి నాకు జ్ఞాపకం వచ్చింది. నన్ను తన వీలునామాలో స్థానం లేకుండా తోసివేస్తారని కూడా సంఘం వారు చెప్పారు.

రెండూ జరిగాయి.

నేనూ, మా నాన్న ఒకరి కొకరు అంత సన్నిహితంగా ఉండేవారం కాదు. ఆయన 'ప్లిమత్ బ్రెదెన్'ల సభ్యుడు. చాలా దైవభక్తి కల మనిషి. ఆచారాలు, పట్టింపులు ఎక్కువ. నాకు కావలసినంత దైవభక్తి లేదని విచారించేవాడు. అయినా నేను మొదటి కొడుకుని, ఆయన ఆస్తికి వారసుని. . . .

ఒక దినం—1950లో ననుకుంటాను— నాతో చెప్పాడు, ఎవరో టెలిఫోన్ చేశారని, పుర్రె, ఎముకలు ఉన్న ఉంగరం గురించి చెప్పారనీ, నన్ను పూర్తిగా త్యజిస్తే గాని కుటుంబంలో వారంతా నాలాగే నశిస్తారని చెప్పారని కూడా మా నాన్న చెప్పాడు.

సైతాన్ సంఘంతో నా కున్న సంబంధం గురించి మా నాన్నతో చెప్పక తప్పలేదు. 'అంతా విధి' అని నచ్చచెప్ప చూశాను. కాని ఆయన వినిపించుకో లేదు. చాలా బాధ పడ్డాడు.

'టెలిఫోన్ కాల్' తన మరణానికి నాంది అనుకుని దిగులు పడిపోయాడు. నేను చేసిన పాపాలకి తగిన శిక్ష విధించాలని నిశ్చయించుకున్నాడు. వీలునామా తయారు చేయించాడు.

చేయించిన కొద్ది కాలంలోనే, 69వ ఏట, గుండె ఆగి చనిపోయాడు. సాధారణంగా ఆయనకి ఏ జబ్బూ చేసేది కాదు.

మా తండ్రి ఆస్తి విలువ సుమారు 20 లక్షల రూపాయలు. అందులో నా వాటా అతి స్వల్పం అని తేలింది. వ్యాపారంలో నేను చేసిన అప్పులన్నీ నేనే తీర్చుకోవాలి. మా తండ్రి ఆస్తి మీద ఆశలు పెట్టుకుని లాభం లేదు.

అయినా ఆయనది తప్పని నే నెన్నటికీ అనను. అంతా మా సంఘం ప్రభావమే.

స్కాట్లాండ్‌లో ఎన్నో సంవత్సరాల క్రితం మా సంఘం 'పూజారిణి' సిసెరా ఇదంతా జరగ గలదని చెప్పింది.

నా పెళ్ళి కూడా పెడిపోతుందని చెప్పింది. అది జరిగింది. 23 ఏళ్ల సంసారం తర్వాత నా భార్య విడాకులు కావాలని పట్టుబట్టింది. తప్పంతా నాదేనని విచారణలో తేలింది. అంతా మా సంఘం ప్రభావం.

ఇటలీలో నా మిత్రుడొకడు కారు ప్రమాదంలో చనిపోయాడు. ఇది జరగ గలదని మా పూజారిణి చెప్పింది. తెలిసికూడా ఏమీ చెయ్యలేక పోయాను.

ఒక రాత్రి— మెలుకువ వచ్చింది. నా కిటికీ దగ్గర ఏదో శబ్దం. తర్వాత ఎవరిదో సన్నని ఆర్తనాదం. ఆ తర్వాత నిశ్శబ్దం.

ఒళ్ళంతా చెమటలు పట్టింది. లేచి వెళ్ళి కిటికీ తెరలు తొలగించాను. తెల్లటి బురఖా వేసుకున్న ఆకారం ఒకటి ఇంటి చుట్టూ ఉన్న అంచులమీద నుంచుని ఉంది. పడిపోకుండా ఉండటానికి ప్రయత్నిస్తోంది. గబగబ కిటికీ తెరిచాను. కాని, ఇంతలో పెద్ద అరుపుతో బురఖా వ్యక్తి వెనక్కి కూలి పడిపోయాడు.

గాభరాగా కిందికి పరిగెత్తాను.

కాని శవం కనిపించలేదు.

అది 'క్లైటన్ కారీ'. నేను అద్దెకి తీసుకున్న పదిహేనవ శతాబ్దపు భవంతి.

సంఘం పగని తప్పించుకుని పోదామని ఈ భవంతి అద్దెకి తీసుకున్నాను.

ఇంతకు ముందే చెప్పాను, మీకు జ్ఞాపకం ఉందో లేదో ? గొర్రెతో ఒక అమ్మాయిని చంప చూసిన యత్నం నన్ను బాగా కలత పెట్టేసింది.

సంఘం నుంచి తప్పుకున్నాను. కాని, సంఘం నన్ను వదల లేదు. వెంటాడింది. భయపెట్టి పగ తీర్చుకోవాలని ప్రయత్నించింది.

అయితే, కిటికీ దగ్గర కనిపించిన బురఖా ఆకారం ఎవరిది ? అసలు అది సజీవ మానవాకారమేనా ? కేవలం నా భ్రమ మాత్రమేనా ? భ్రమ మాత్రం కాదని నా నమ్మకం.

ఆ రాత్రి ఒక చిన్న చర్చిలో గడిపాను. అక్కడ తప్ప నాకు సంరక్షణ లేదనుకున్నాను.

తెల్లవారింది. లేచి వెళ్ళి రాత్రి శవం ఉండవలసిన చోటు పరిశీలించాను. మంచు పడి తడిగా ఉన్నా ఒక 'క్రాస్' ఆకారం గల ప్రదేశం మాత్రం పొడిగా ఉంది !



అన్ని బాధలనుండి విముక్తి పొందిన హాడ్ డిబ్బెన్ యీనాడు భార్య మెరిల్లాతో ప్రశాంతమైన జీవితం గడుపుతున్నాడు.



రచయిత మొదటి భార్య

భయంతో ఒళ్ళు గగుర్పొడిచింది. ఇదంతా ఏదో సైతాన్ వ్యవహారమే ! సందేహం లేదు ! నన్ను బెదరకొట్టి, బెదరకొట్టి ఈ విధంగా భయ విహ్వలుడిని చేశారు సంఘం వారు. . .

లండన్‌కి పారిపోయాను. ఒక హోటల్లో దాక్కున్నాను. రోడ్డు మీదకి వెళ్ళటానికే భయ పడే వాడిని.

కొన్ని రోజుల తర్వాత నా కొడుకు మైకేల్ 'క్లైటన్ కారీ'కి వెడుతున్నాడని విని నేనూ అక్కడికి వెళ్ళాను.

మైకేల్ క్లైటన్ కారీని చూసి ముగ్ధుడయ్యాను. "అద్భుతంగా ఉంది. ఇక్కడే ఉండి పోతే ?" అన్నాడు.

నేను నా భయంకరానుభవాలని గురించి చెప్పలేదు. భోజనం తర్వాత ఇద్దరం నిద్రకి ఉపక్రమించాము.

పొరపాటున మాకు ఉద్దేశించబడిన గదులు తారుమారయ్యాయి. రాత్రి ఈ సంగతి తెలిసినా ఫరవాలేదని నిద్రలో తిరిగి మునిగిపోయాను.

తెల్లవారింది. ఎనిమిది గంటలకి మైకేల్ గదిలో కెళ్ళటానికని బయలు దేరాను. అతని గది తలుపు తీసే ముందే అతనే పరిగెత్తుకుంటూ వచ్చాడు.

"నాన్నా, తొందరగారా!" అంటూ తన గదిలోకి తీసుకు వెళ్ళాడు.

కిటికీ తెరిచి ఉంది. తన భుజాలు ఎత్తి పట్టుకున్నాడు. గాలికి రెపరెపలాడింది. నాకిదంతా అర్థం కాలేదు. అతని వంక అయోమయంగా చూశాను.

"తెరలో ! తెరలు కదలవేం ?" అని అరిచాడు.

నిజమే ! ఆశ్చర్యం ! తెరలు కదలటం లేదు. పక్క గదిలోకి వెళ్ళి కిటికీ తెరిచాను. అక్కడి తెరలు గాలికి ఉవ్వెత్తుగా లేచాయి. . . .

"నా గదిలో ఏదో తమాషా ఉంది, నే నిక్కడ పడుకోలేను ?" అన్నాడు మైకేల్.

మైకేల్ చెప్పినదాంట్లో అతిశయోక్తి లేదు.

(ఇంకా ఉంది)

# వానలో నవ్వులు!

కుంభవర్షం కురియనీయండి! మీకు చింతఏల? మీ వద్ద నివియా వున్నది! నివియాలో "యుసిరైట్" అసమాన పదార్థం వున్నది. అది రోజూ స్నానమందు. మరియు ఎండ, గాలి, వానలకు లోనగుటవల్ల గోల్పోయిన మీ చర్మమందలి సహజ చమురులను మరల పూరించు తుంది. మీ చర్మానికి కావలసిందల్లా నివియా. మీ చర్మమునకు అది జవాబు.






# నివియా వివిధోపయుక్తమైన క్రీమ్

మీ చర్మమును మృదువుగాను, యౌవన పూరితమైన ఆరోగ్యవంతంగాను వుంచుతుంది.






జె.ఎల్. మారిసన్, సన్ అండ్ జోన్స్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్., పోస్టు బాక్సు నం. 1748, బొంబాయి-1.

Myers C. 249 Tl.

# సైనిక శిక్షణలో సిద్ధహస్తులైన ఇజ్రాయల్ మహిళల ప్రగతి!

జె. వరలక్ష్మి

ఇజ్రాయల్ దేశంలో "జుడాయిజమ్" యొక్క సంప్రదాయాలు ఇప్పటికీ ఉన్నవి. పురాతనకాలపు ఈ సంప్రదాయాలు న్యాయం, దానం అనే మూలసూత్రాల మీద ఆధారపడి ఉన్నవి. సమాజంలోని ప్రతివ్యక్తి ఎడలా, సమాజానికి పూర్తి బాధ్యత కలదని యీ 'హిబ్రూ' సిద్ధాంతాలు ఘోషిస్తున్నవి. న్యాయమే వర్ధిల్లాలంటే బీదా బిక్కీ, అనాధలు, వితంతువులు, ముసలివాళ్ళు, వికలాంగులు, కుంటీ గుడ్డి వారి ఎడల దాతృత్వం వహించి, వారి అవసరాలు ముందు చూడాలని ఈ సిద్ధాంతాలు నొక్కి చెబుతున్నవి.

సంప్రదాయసిద్ధమైన ఈ భావాలు బ్రిటిషు వారి పరిపాలన కాలంలో పాటించబడలేదు. అందుచేతనే పాలస్తీనాలోని జ్యూయిష్‌జాతి సంతృప్తిగా జీవితం గడపలేకపోయింది. కాని పరాయి పాలన అంతమొందిి, జాతీయ ప్రభుత్వం ఏర్పడిన తరువాత, సమాజం యొక్క స్వరూపమే మారిపోయింది. వ్యక్తి స్వేచ్ఛను గుర్తిస్తూ, వ్యక్తికి సమాజంలో ఉండవలసిన సాంఘిక భద్రతను కలుగజేస్తూ పరిపరివిధాల సంక్షేమ కార్యకలాపాలు నిర్వహించబడుతున్నవి.

ప్రభుత్వ పరంగా జరిగే కృషే కాక, స్వచ్ఛంద సంస్థలద్వారా బహుముఖమైన కృషి జరుగుతున్నది. జ్యూయిష్ ఏజన్సీ, "హిస్టాడ్రుట్", "హదాసా" అనే సంస్థలు ఎన్నదగిన సేవ జేస్తున్నవి. సాంఘిక సంక్షేమం ఏ ఒక్కరివల్లా జరిగేది కాదనీ, ప్రభుత్వం, ప్రజలు దేశంలోని సంస్థలు అన్నీ సహకరించి పనిచేయాలనీ అందరూ గుర్తించారు.

ఇజ్రాయల్ ప్రభుత్వానికి ఆదర్శాలు ఉన్నవి. ఒక వైపు "లెజిస్లేషన్" కూడా ఉన్నది. కాని వీటన్నిటికీ మించి జనసముదాయం యొక్క అనుమతి, ఆసక్తి కూడా కావాలి కదా! ప్రతివారికీ తిండీ, బట్టా, నివసించడానికొక యిల్లూ ఉండాలి అనే సిద్ధాంతాన్ని ఆదర్శంగా పెట్టుకొని ఇజ్రాయల్ ప్రభుత్వం కృషి చేస్తున్నది. స్త్రీ పురుషులకు సమానమైన హోదాను యిస్తూ నవంబరు 18, 1953 వ తేదీన 'నిస్సెట్' అనబడే పార్లమెంటు ఒక చట్టాన్ని ప్యాసు చేసింది.

ఈ దేశంలో ఇజ్రాయల్ గడ్డపై పుట్టినవారు కాక యుద్ధానంతరం నాజీ కాన్‌సెన్ట్రేషన్ క్యాంపులనుండీ, అరబ్ దేశాల నుంచీ తూర్పు ఆఫ్రికా నించీ వలస వచ్చినవారు అనేకమంది ఉన్నారు. చేతులు లేనివారూ, కాళ్ళు లేనివారూ ఈ కాందిశీకులలో అనేకమంది. వీరందరికీ ఉపాధి కల్పించడమే ప్రభుత్వానికొక విధిగా పరిణమించింది. ప్రస్తుత ఆదర్శాలు యివి :

1. విద్యావిషయకంగా 'స్టాండర్డు' చాలా తక్కువగా ఉన్నది. అందుచేత విద్యాసంస్థలను స్థాపించి,



సమితి ప్రతినిధివర్గానికి నాయకత్వం వహించిన ప్రముఖ సంఘ సేవకురాలు శ్రీమతి గోల్డామేర్.

నిరక్షరాస్యులకు విద్య గరపటం ప్రధానమైన కర్తవ్యమని ప్రభుత్వం భావిస్తోంది. విద్యాప్రచారానికి కావలసిన సాధనాలతోపాటు గ్రంథాలయాల స్థాపన కూడా ముఖ్యమని భావించబడుతోంది. ప్రతి అయిదు గ్రామాలకు ఒక గ్రంథాలయం ఉంది. గ్రంథాలయ సిబ్బంది ఇంటింటా, వాడవాడలా తిరిగి పుస్తకాలు పంచియిస్తారు.

2. ఆరోగ్య విషయం— నవీన సమాజంలో, నవీన కాలానికి సంబంధించిన పద్ధతులలో క్రొత్త జీవితానికి అలవాటుపడేవిధంగా ప్రజలకు నచ్చచెప్పటం ప్రధానమైనది.

3. ఒకవిధంగా సాంఘిక జీవితాన్నే మార్చి, స్త్రీ పురుషులు సమాన భాగస్వాములుగా పాల్గొనే విధంగా సాంస్కృతికపరిణామం తేవటం ముఖ్యమైనది.

4. గృహ వసతులు విరివిగా కల్పించి జనులు సుఖవంతమైన జీవితం గడిపేలాగా చూడటం కూడా మరొక ప్రధాన కర్తవ్యం. ఈ విధుల నిర్వహణలో ఇజ్రాయల్ ప్రభుత్వం విజయాన్ని సాధించగలిగిందనే చెప్పాలి.

## శిశుసంక్షేమం

1953 లో ప్యాసయిన "అప్రెంటిస్‌షిప్ లా" "చైల్డు ఎంప్లాయిమెంటు లా" ల ఆధారంగా శిశు సంక్షేమం నిర్వహించబడుతున్నది. 18 సంవత్సరాల లోపు పిల్లలను పనులలో నియోగించే విషయం లోనూ, వారికి జీతం వగైరా యివ్వటంలోనూ, వారి పనిని శ్రద్ధగా 'సూపర్‌వైజు' చేయడంలోనూ అనేక శాసనాలు చేయబడినవి.

41 వ పేజీ చూడండి





అందాలనటి బి. సరోజాదేవి

ఫొటో: ప్రకాశ్

రైలు గట్టిగా కూత వేసి బయలుదేరింది. చెట్లు, పొలాలు వెనక్కి పరిగెడుతున్నాయి. ఫస్టు క్లాసు కంపార్టుమెంటు, అందులో ముప్పయి సంవత్సరాల స్త్రీ. ఆమె ప్రక్కనే ఒక నాలుగు సంవత్సరాల పాప కూర్చుని వుంది. ఆ స్త్రీ కిటికీ గుండా బయటకు చూస్తూ ప్రకృతిని తిలకిస్తుంది. ఆమె కెదురు బెర్తు మీద సూటులో వున్న ఒక ముప్పయి ఐదు సంవత్సరాల వ్యక్తి, ఆమె వంకే రెప్పవేయకుండా చూస్తున్నాడు. ఆమెను చూచి అతడు ఏదో ఫీలవుతున్నాడు. ఎక్కడో చూసి నట్టు వుంది. చదువుకున్నదానిలానే ఉంది.

" ఎక్స్క్యూజ్ మీ, మీ పేరు తెలుసుకో వచ్చా," అడిగాడు.

ఆమె నెమ్మదిగా అతని వైపు చూసింది.

అవే చూపులు, అవే కళ్ళు, ఏదో గుర్తుకొస్తుంది. కానీ, కానీ ఎవరు ? ఎవరామె ? అతనికి ఆత్రుత ఎక్కువయింది. ఆమె ఏమీ మాట్లాడకుండానే చూపుల్ని కిటికీ గుండా బయటకు ప్రసరించింది. అతనికి మరీ ఆసక్తి కలిగింది. పిలిచినా పలుక లేదు. ఎవరు ? అదే అతని ఆలోచన. ఆమె తెల్లటి మెడ మీద నల్లటి పుట్టుమచ్చ కనబడింది. అంతే ఒక్కసారి షాక్ తిన్నాడు. ఎవరి వల్లయితే కాలేజీలో తన పరువు పోయిందో, ఎవరివల్లయితే తన ప్రేమ తిరస్కరించ బడిందో, ఆమె, ఆమె ' లత ! లత' అదేమాట అప్రయత్నంగా అతని నోటి వెంట వెలువడింది. ఆమె ఒక్కసారి అతన్ని చూచి మళ్ళీ చూపుల్ని మార్చేసింది. అవును ఆమె తనతో మాట్లాడదు. అవును ఎందుకు మాట్లాడుతుంది. ఒకచోట చదివేటప్పుడే మాట్లాడ లేదు. ఎప్పుడు ఎప్పుడు మాట్లాడుతుందా, మాట్లాడదు, ఆమె మాట్లాడదు. ఒక్కసారి పసిపాప వైపు చూచాడు. పాప నవ్వింది. అతను నవ్వాడు. అతను పరీక్షగా చూశాడు. అప్పటికీ ఇప్పటికీ ఎంత మార్పు. అప్పుడు సన్నగా పొడుగ్గా వుండేది. రెండు జడలు, కాళ్ళకి హవాయి స్లిప్పర్సు, చెవులకు రింగులు, కుడిచేతికి చిన్న రిస్టువాచీ, ఎడం చేతికి రెండు బంగారు గాజులు, మెడలో చిన్న చైను. సాధారణంగా కటావ్ వాయిల్ చీరలు కట్టేది. పమిటని భూమి వరకు జారే సేది. అందుచేతనే అప్పట్లో ఆమెను ' కాలేజ స్వీపర్ ' అనేవాళ్ళు అంతా. కానీ ఇప్పుడు, జడను చుట్ట చుట్టడంవల్ల వేసుకుంది. రెండు చేతులకి బంగారు గాజులు, మట్టి గాజులూ వున్నాయి. కాళ్ళకి మెట్టెలు, మెళ్ళో మంగళ సూత్రాలు తళ తళ లాడు తున్నాయి. ఆకుపచ్చ సిల్కుచీర కట్టింది. ఆ స్టైల్ అంతా ఏమయి పోయిందో మరి. ఏమిటబ్బా ఈ మార్పు. సరిగ్గా ఆమెను చూచి ఇప్పటికి పది పన్నెండు సంవత్సరాలు దాటింది.

" ఇప్పుడు మీరెక్కడుంటున్నారు ? మీవారేం చేస్తున్నారు ? "

" నేను చేసిన అపరాధమేమిటి, మీతో మాట్లాడటానికి కూడా తగనా, అప్పటికీ ఇప్పటికీ కూడా మీలో మార్పు రాలేదా ? "

" . . . . . . . . . . . . "

" విద్యార్థి దశలో అలా తిరగడం అల్లర్లు చేయటం అది ఎప్పుడూ జరిగేదే, మీరు అంత ఆగ్రహిస్తే," ఆమె ముఖం చూడాలని మధ్యలో ఆపాడు.

" — — — — " ఆమె కనీసం అతని వంక కూడా చూడలేదు. అతను మౌనంగా కూర్చున్నాడు, ఆమె వంక చూస్తూ. అతని ఆలోచనలు అనాలో చితంగా పన్నెండు సంవత్సరాల వెనక్కు తిరిగింది.

అవి వాళ్ళు కాలేజీలో చదువుకునే రోజులు. తను ఏ విషయంలోనైనాసరే, కాలేజీలో పేరు మోసిన హీరో. 'లత ' అతని క్లాసుమేటు. ఆమెను అభిమానించేవాడు. తను కూడా సినిమాల్లో హీరోలాగే చేస్తే ఆమె తనని ప్రేమిస్తుందని ఆమె వెంటపడి గొడవ చేసేవాడు. ఆమె ఏ సినిమాకి వెడితే ఆ సినిమాకి వెళ్ళేవాడు. ఆమె సినిమాకి వస్తుందోరాదో అని గేటు వద్ద బీటు వేసేవాడు. అతను అసలు ఆమెని ప్రేమిస్తం మొదలు పెట్టింది ఆమె తిట్టిం తర్వాతనే. ఒకసారి లత వెళుతుంటే ఎవరీమె జట్ ఫైటరా లేక కటావ్ వాయిల్ సుందరీ అన్నాడు. సమాధానంగా ' ఇడి యట్ ' అని వెళ్ళి పోయింది. అప్పట్నించి వెంట పడడం మరీ ఎక్కువయింది. ఎక్కడేనా కనిపిస్తే పలకరింపుగా నవ్వడం, ఎంతో పరిచయమున్నవాడిలా ఫోజు పెట్టటం చేసేవాడు. 'లత' అసలు అతని వంక కూడా చూడకుండా వెళ్ళి పోయేది. అతను అదంతా ప్రేమే అనుకున్నాడు. కాలేజీ ఎలక్షన్సు వచ్చాయి. ఎలక్షన్సులో నిలబడితే నయినా ఆమెతో మాట్లాడ వచ్చని, ప్రెసిడెంటుగా పోటీ చేశాడు.

ఆమె ఇంటికి వెళ్ళాడు. ఆమెను కోపరేట్ చేయ మని.

" నమస్కారమండీ "

" . . . . . . . . . . . . . . . "

" నేను ఎలక్షన్సులో పోటీ చేస్తున్నా, తప్పక మీరు కోపరేట్ చేస్తారని ఆశిస్తున్నా."

" . . . . . . . . . . . . . "

ఆ ముఖాన్ని పరీక్షగా చూశాడు. ఏ భావమూ కన బడటం లేదు. ఒక వెయ్యి పాంప్లెట్లు కట్ట ఇచ్చాడు. అందరికీ డిస్ట్రిబ్యూట్ చేయమని. మాట్లాడ కుండానే అందుకుంది.

" తప్పక మీ సహాయం లభిస్తుందని ఆశిస్తున్నా ఇక వెళ్తున్నానండీ "

" . . . . . . . . "

కనీసం తన వోటు కాదు కదా ఇతరులను కూడా వేయకుండా చేసింది. కానీ మొగాళ్ళ పలుకుబడితో పెద్ద మెజారిటీతోనే గెలిచాడు. థాంక్సు చెప్పటానికనే వంకతో మళ్ళీ ఆమె ఇంటికి వెళ్ళినా, ఇంట్లో వుండి కూడా లేదని చెప్పించింది. దాంతో అతనికి అర్థమయి పోయింది. ఆమె తనని ఎంత గాఢంగా ద్వేషిస్తుందో. ఆమెను మర్చిపోవాలని ప్రయత్నించాడు. కానీ అది సాధ్యం కాలేదు. ఆమెను అంత తేలికగా మరిచి పోవడమూ. దాంతో ఇక లాభం లేదని, ఆమె తనని అసహ్యించుకుంటే తప్ప తనకి ఆమె మీద ఇష్టం పోదని మరీ అల్లరి చిల్లరిగా మొదలు పెట్టాడు. ఒకసారి సినిమాకి వచ్చింది. అతను వెళ్ళి పక్కనే సీట్లో కూర్చున్నాడు.

" సిగరెట్టు తాగచ్చా." అని అడిగాడు.

" . . . . . ." తనంటే అసలు లెక్కలేనట్టుగా మూరుకుంది.

ఒక ఆడదానికి మగవాడంటే అంత అలుసా.

సినిమాలో ఏదో సీను వచ్చింది, దీన్ని చూచి అతను:

"దీన్ని 'రెడ్ఫోర్టు' అంటారు మీరు చూశారా?"

". . . . . . . . . . . . . . . ."

"నేను ఢిల్లీ, ఆగ్రా అన్నీ తిరిగానుకొండి. అప్పుడు చూశా."

"మీరు ఢిల్లీ ఎప్పుడయినా వెళ్ళారా ?"

". . . . . . . . . . . . ."

"ఇంతమందిలో మీరు సిగ్గుపడుతున్నట్టు న్నారు నాతో మాట్లాడటానికి."

". . . . . . . . . . . ."

"ప్రేయసీ ప్రియులనుకుంటారు అంతేగా"

". . . . ." సీరియస్గా ఒకసారి చూసింది.

కాస్సేపు వూరుకుని మళ్ళీ,

"రేపు నా పుట్టిం రోజు. పార్టీకి తప్పకుండా రావాలి. వస్తారు కదూ ?"

లత పక్కనే ఉన్న లత అక్కారమ అంది: 'నీ తద్దినానికి తప్పక వస్తాం' దాంతో ఆ సీటు ఖాళీ చేసి వచ్చేశాడు. రోజులు అలాగే గడుస్తున్నాయి. అసలే ఇద్దరికీ పడక చస్తుంటే, ఒక ప్రబోట్ అల్లరి కోసం గోడల మీద లతా శ్యాంసుందరుల ప్రణయ వృత్తాంతం అని పెయింట్ చేశాడు. తన పరువు పోయింది. స్టూడెంట్సు యూనియన్ ప్రెసిడెంట్ అవటం వల్ల మరీ అల్లరయిపోయాడు. లత మటుకు మామూలుగానే ఉంది. అసలేమీ ఎరగనట్టుగానే ఉంది. అతనికి రోజు రోజుకీ ఆమె అంటే అభిమానం ప్రేమ పెరిగి పోవడం మొదలు పెట్టాయి. కొన్ని రోజుల తర్వాత ప్రిన్సిపాలు పిలిచి తిట్టాడు లతను ఏడిపిస్తున్నాడనే ఆరోపణతో. అతను బల్లగుద్ది వాదించాడు.

"దాన్ని ఏడిపిస్తం అనరు. ప్రేమిస్తం అంటారు" అని.

"షటప్" అని అరచాడు ప్రిన్సిపాలు గట్టిగా.

"స్టూడెంట్సు యూనియన్ ప్రెసిడెంటువి నీవే ఇలాటి పనులు చేస్తే ఇక ఎవరు వింటారు. నిన్ను ఒక వారం సస్పెండు చేస్తున్నా" అన్నాడు. అది చాలక ప్రతి క్లాసుకూ నోటీసు పంపాడు. పుణ్యా త్ముడు ఆయన చలవా అంటూ ఉన్న పరువు కాస్తా కాంసంట్రేటెడ్ ఇసుకలో కలిసి పోయింది. తర్వాత అతనితో వైరాగ్యం కలిగింది. ఒక్క ఆడ దానివల్ల కదా, పేరు గోడ లెక్కిందీ, ప్రిన్సిపాలు తిట్టిందీ, సస్పెండు చేసిందీ, అసలు ఆడదాన్ని ప్రేమించకూడదు, అసలు మాట్లాడనే కూడదు. మళ్ళీ అనిపిస్తుంది ఆమె ప్రేమించక పోతే పోనీ కనీసం మాట్లాడ కూడదు. ఒక్క చిరునవ్వు నవ్వ రాదూ ? అదైనా చాలుకదా ఈ అదృష్ట హీను డికి. ఇది జరిగిన ఒక నెల తర్వాత బోటానికల్ టూరుకు వెళ్ళారు. కనీసం అక్కడైనా మాట్లా డదా అని అభిప్రాయం. ఆమె ప్రేమించక పోతే, పోనీ, తనతో ఒక్క మాట మాట్లాడితే, అదే ఈ జన్మకి చాలు. ఎలాగైనా ఆమెని పలకరిం చాలి.

ఒక కాలవ పక్క నుంచి నడుస్తున్నారు. లత కాలుజారి నీళ్ళలో పడింది. అతను గబుక్కున నీళ్ళల్లోకి దూకి ఆమెను రెండు చేతులతో పట్టు కున్నాడు. ఎప్పుడూ తనతో మాట్లాడక పోయినా,

# ఆమె మాట్లాడింది

తనవంక ఆమె చూడక పోయినా ప్రస్తుతం ఆమె అతని చేతులలో ఉంది. ఒక చెయ్యి ఆమె నడుం చుట్టూ వేసి గట్టిగా పట్టుకుని, "భయం లేదు నేను వచ్చాగా."

"...............……"

"జాగ్రత్తగా పట్టుకోండి, పడ్డక్కత్తుకోళ తాను."

"...............……"

కనీసం థాంక్స్ కూడా చెప్పలేదు.

ఇదేదో శాపకారణమనిపిస్తుంది. ఆమె అసహ్యించుకున్నా, మాట్లాడక పోయినా, రిపోర్టు చేసినా కూడా అతను ప్రేమిస్తున్నాడు. కనీసం ఈ జన్మకి కాక పోయినా మరు జన్మకైనా లతా పతిని చేయమని దేవునికి మొక్కుకున్నాడు. అసలు తనకేం తక్కువ. అందం లేదా, చదువులేదా, డబ్బు లేదా, ఏ ఎందుకు ప్రేమించదు, నాకంటే మంచి మొగుడు వస్తాడా అసలు అని. ఇదే ప్రశ్న కొందరిని అడిగితే నీకు తలకాయలేదు. మాట్లాడటం రాదు అని అన్నారు. అసలు ప్రేమించే విధం అదికాదని, గిలా, అలా అని హితోపదేశించింది కొందరు, (అరి తేరిన ఘటాలు) అన్ని వల కెక్కినా, ఆమెని చూసేసరికి ఈ ప్రపంచం, కాలేజీ అన్నీ మర్చి పోతాడు. కారణం, ఆ అమాయకపు చూపులు, ఆ చూపుల్లోనూ, కళ్ళల్లోనే ఉంది ఆ అమ్మాయి అందమంతా. ఏమీ పట్టించుకున్నట్టే ఉండదు. కాని అన్నీ తెలుసు.

ఆ సంవత్సరంతో బందరు చదువు అయిపోతోంది. అంటే ఇంటర్లోంచి ఇంకో వూరుకు తరవేనా తప్పమాట. లతని చూడకుండా ఉండగలడా ? బాబోయ్ తలచుకుంటే నే గుండెలు దడదడ లాడాయి. అంతకంటే గుండెలు పగిలే వార్త, ఇక తను ఎవరి కోసం జీవించాలి, తన బ్రతుకు వ్యర్థం. కారణం లత పెళ్ళి స్థిరమయి పోయింది. ఇక ఆశ లేదు. ఆమెను మర్చి పోవాలి.

పది రోజుల్లో ఆమె పరాయి సొత్తయి పోతుంది. ఆ వూరు వదిలి పోవాలి. మళ్ళా జీవితంలో లతని చూడ గలడా ? ఏమో అది సాధ్యం అవుతుందా? పెళ్ళికి సంబంధించిన విషయాలు సేకరించాలని కూడా అనిపించలేదు. వెళ్ళి తనని క్షమించమని అడగాలనుకున్నాడు. అలాచేసినా కనీసం మాట్లాడదు. అవును తను చేసిందంతా తప్పు. తను ఆమెని విసిగించాడు. అసలు ఆమె గనకే తనని అంత తేలిగ్గా వదిలేసింది, నిజంగా ఆమె ఎంత మంచిది. ఎప్పటి కప్పుడు వెళ్ళి క్షమించమని అడగాలనుకున్నాడే గాని వెళ్ళలేదు. లత పెళ్ళి అయిపోయింది. ఆమె భర్తతో పాటు వెళ్ళిపోయింది. కారు అతని ఇంటి ముందగ నుంచే వెళ్ళింది. అతనికి పిచ్చి ఎత్తినట్లయింది. అతను ఇక లత లేని వూళ్ళో ఉండడానికి మనస్కరించక విశాఖపట్నం వెళ్ళి 'బి. యల్'లో చేరాడు. రెండు సంవత్సరాల తర్వాత 'లాయర్ శ్యాం సుందర్'గా తిరిగి వచ్చాడు. లత గుర్తుకు రావటం వల్ల ఇక వాదింపలేక రెండు మూడు కేసులు ఓడి పోయాడు కూడా. ఆమె మద్రాసులో ఉంటుందని తెలుసు. కాని ఆ మహా పట్టణంలో ఎక్కడని కలుసు కోవడం. కలిస్తే మాటుకూ, చూచి ఆనందించా ల్సిందే, పాత బాధల్ని గుర్తుకు తెచ్చుకుంటం తప్ప కనీసం ఒక్క మాట కూడా పలకదు. పన్నెండు సంవత్సరాల క్రితం కాలేజీలో తనకూ లతకు జరిగిన సంఘటనలన్నింటినీ కలిపి ఒక మధుర స్మృతిగా తన హృదయంలో దాచుకున్నాడు. అందం ఒక తళుకులా గుర్తు వస్తుంది అతనికి. ఆమె పెళ్ళయిన తర్వాత మళ్ళా పన్నెండు సంవత్సరాలకి ఆమెని చూశాడు. ఇప్పుడు ఆమెలో ఎంతో మార్పు కన్పిస్తుంది. అప్పటి లతకి అసలు ఇప్పుడు పోలికే లేదు. ఇప్పుడు బొద్దుగా ఎంతో నిండుగా ఉంది. అదే కారణం ఆమెని గుర్తు పట్టడానికి ఆలస్యం అవడానికి. ఇప్పుడు కూడా ఆమె తనతో మాట్లాడక పోవడం, చాలా బాధ కలిగింది. ఆఖరుసారిగా పిలవాలనుకున్నాడు.

"ఏమండీ ఒక్క మాట."

అతని వంక చూచి వూరుకుంది.

"జీవితంలో మానవుడు అనేక పొరపాట్లు చేస్తాడు. కాని వాడు చేసింది తప్పు అని తెలియ గానే పరితాపం చెందుతాడు. అట్టివారిని క్షమించడం చదువుకున్న వారి లక్షణం. ఆఖరుసారిగా పలక రిస్తున్నాను. గడచిన ఈ పన్నెండు సంవత్సరాలు నేను ఎక్కడో, మీరెక్కడో. కాని ఒక్కసారి మనం ఈ విధంగా ఈ రైలులో కలవడం నా అదృష్టం. ఒక్క మాట చెప్పండి. ఇప్పుడెక్క డుంటున్నారు. రైలు స్పీడు తగ్గింది. నేను దిగ వల్సిన స్టేషను వచ్చేస్తుంది. ఎప్పుడైనా మీరు కనిపిస్తే క్షమించమని కోరాలనే నిరీక్షిస్తున్నాను. ఇన్నాళ్ళ తర్వాత, కొన్ని సంవత్సరాల తర్వాత ఒకరి కొకరం కనబడ్డాం. మళ్ళీ ఇప్పుడే దూరమవు తున్నాం. రైలు ఆగింది. ఇక నేను దిగిపోవాలి. నన్ను క్షమించండి." అని, భారంగా పసిపాప వేపు చూశాడు. ఒక్కసారి చేతుల్లోకి తీసుకుని, ముద్దులతో ముంచే శాడు; పాప ఉక్కిరి బిక్కిరి అయింది.

జేబులోంచి ఒక నోటు తీసి పాప చేతిలో పెట్టాడు. పాప గట్టిగా పట్టుకుంది, పాపని మళ్ళా వదలి, ఆమె వంక చూశాడు. ఆమె లోన ఏదోగా బాధ పడు తున్నట్టు అనిపించింది అతనికి. "ఇక నే వెళు తున్నాను. క్షమించండి" అని రెడ్ సూట్‌కేసు పట్టుకుని క్రిందికి దిగాడు.

వెనక నుంచి—

"ఏమండీ" అన్న సన్నని కంఠం వినిపించింది. దేనికోసమైతే తాను కాలేజీలో నాలుగేళ్ళు, తర్వాత పన్నెండేళ్ళు గడిపాడో అదే ఎదురయింది. ఆ కంఠంలో అనేక కోకిల కంఠాలు విన్నాడు. ఆనందంతో వెను తిరిగాడు.

ఆమె తలుపువద్ద నిలబడి ఉంది.

ఆ ఆనంద సమయంలో ఏమి మాట్లాడాలో తెలీక

"ఏమండీ" మళ్ళీ పిలిచింది.

'ఊ. . .' అన్నాడు ఉక్కిరి బిక్కిరవుతూ.

రాలుగా కళ్ళు కలిసాయి. ఇద్దరూ మాట్లాడే స్థితిలో లేరు. రైలు గట్టిగా కూత వేసి బయలు దేరింది. వాళ్ళిద్దరినీ వేరుచేశానన్న బాధతో, అతను చెయ్యి వూపుతుండగానే రైలు కనుమూసు మరుగైంది. తన కదే చాలు అనుకున్నాడు. అదే. . . ఆమె మాట్లాడింది. ★



మీ కృషియే దేశానికి సౌభాగ్యం
మీ పొదుపే రక్షణ నిధికి మదుపు

# జెన్‌సన్ & నికల్‌సన్

# రోబియాలాక్ పెయింట్లు

## లోపలి, వెలుపలి పూతలకు అందరూ సహజంగా ఎన్నుకొనేవి.



దీనికి కారణాలేమంటారా...

**రోబియాలాక్ ప్లాస్టిక్ ఎమల్షన్**

1. కమ్మలు తీగెలు గొలిపే 120 రంగులలో లభ్యం కాగలదు.
2. ఒక గంటలోనే ఆరిపోతుంది.
3. కుంచె గుర్తు లేకుండా ధారాళంగా ప్రాకిపోతుంది.
4. ఎన్నిసార్లు కడిగినా, తుడిచినా రంగు తగ్గదు.

**రోబియాలాక్ సూపర్ - గ్లాస్ సింథెటిక్ ఎనామెల్**

1. రంగు తరగని, కాంతులీనే మెరుగు కలిగివున్న అనేక వర్ణాలలో లభ్యం కాగలదు.
2. పూతపూసిన తర్వాత మెరుస్తూ అందంగా వుంటుంది.
3. ఎలాంటి ఉపరితలాలకైనా పూర్తి రక్షణ నిస్తుంది.
4. త్వరగా ఆరుతుంది. పూత పూయడం అతి తేలిక.




జె & యస్ కోటింగ్స్‌ను అమ్మేది నాణ్యతే




వర్ణాల పూర్తి వివరాలకు, ఇతర వివరాలకు మీ సమీపంలోగల జె & యస్ డీలర్‌ను కలుసుకోండి.




(గత సంచిక తరువాయి)

"ఎందుకు దండగ? మా నాన్నగారు సినిమా పాటలు పాడుకోనివ్వరు..." అని వారించింది గీత.

"చూడండి! మీ నాన్నగారు ఏవి కృతులో, ఏవి సినిమా పాటలో అడిగి మరీ దెబ్బలాడతారా ?"

"పోదురూ మీరు మరీని. . . సంగీతానికి, సినిమా పాటకు తేడా తెలియ దేమిటి ?"

సడన్‌గా మోహన్‌కు జ్ఞాపకం వచ్చింది. ఇందాక సినిమాలో హీరోయిన్ దేవుడి ముందు కూర్చుని అరగంటసేపు పాటతో తన పాట్లు మొరబెట్టు కున్నది. ఆ పాట సంగీతమే అనుకున్నాడు తను. . .

"ఇందాక హీరోయిన్ దేవుడి ముందు పాడిన పాట సంగీతం కాదా ?"

"దాన్ని రాగమాలిక అంటారులెండి. సంగీత రాగాలలో సినిమా పాటకు వరస పెట్టారు. . . అంతే కాని అది సంగీతం ఎందుకవుతుంది ?"

మోహన్ కేం బోధపడక బుర్ర గోక్కున్నాడు.

"సంగీతం కాకపోతే కాకపోయింది మీ నాన్నగారి కేం తెలుస్తుంది? ఇలాంటి పాట పాడేసుకుందురూ?" అంటూ సలహా ఇచ్చాడు.

గీత పెదవి విరిచింది.

"నాకు ఎక్కువగా రాక్—ఎన్—రోల్ పాట అంటే ఇష్టం..."

మోహన్ ఆలోచిస్తున్నట్టుగా ముఖం పెట్టి "మోడరన్ ఆర్ట్‌లా మోడరన్ సంగీతమని చెప్తే మీ నాన్నగారు ఒప్పుకోరా ?"

"ఎంత మాత్రం ఒప్పుకోరండి. . .! సినిమా పాటల నిండా బూతులుంటాయట. . .!" అంది గీత నిస్పృహగా.

"అందరూ అలాగే అంటారు. . ."

"మంచి సాక్ష్యమేలెండి! ఆ మాట కొస్తే వర్ణాలు, కృతుల్లో ఉండవా? వాటి అర్థాలు చూశా రంటే అవి మరీని. . ." అంది గీత కోపగించు కుంటూ.

"అయితే అయ్యుండొచ్చు. . కాని ఈ ముక్కకి, ఆ ముక్కకి మధ్య గంటసేపు రాగాలు తీయటం ఉంటుంది కాబట్టి ఆ అర్థం ఎవరికీ అంతుపట్టదు. ఆ ముక్కా, ఈ ముక్కా అతుకేసుకుని అర్థం చేసుకునే ఓపిక ఎవరికి ?"

"సినిమా పాటల్లో మాత్రం మంచివి లేవా ఏమిటండి ?"

"నేనూ మీ పక్షమే. . . అయితే మన మిద్దరం ఏకమై చెప్పినా మీనాన్నగారు వింటారనే నమ్మకం నాకు లేదు. . . ."

గీత నిట్టూర్చింది...

ఆట మళ్ళా ప్రారంభమయింది. . .

ఆట పూర్తయ్యాక గీత, మోహన్ కలిసి బైటి కొస్తున్నప్పుడు "మీ 'సినీరథం' ఇవ్వండి. చదివి ఇచ్చేస్తాను. . . నెలనెలా నాకు తెచ్చి పెడతారుగా ?" అంది గీత.

మోహన్ పంట్లాం జేబులో నుంచి 'సినీరథం' బైటకు లాగి గీత చేతిలో పెట్టాడు. గుంపు తగ్గేంత వరకు కాసేపు వరండాలో నిలబడదామంది గీత. సరేనన్నాడు మోహన్. . . .

గీత ఉన్నట్టుండి "కళ ?" అంటూ కంగారు పడింది.

జరిగిన కథ

విభిన్న మనస్తత్వాలు గల అయిదుగురు అమ్మాయిల తండ్రి రామయ్యగారు. ఆయనకు మద్రాసులో వాచీల వ్యాపారం. రామయ్యగారి స్నేహితుని కొడుకు సుధాకర్ మద్రాసు చూడటానికి వచ్చి వాళ్ళింట్లో దిగుతాడు. అమ్మాయిలందరూ అతని వాలకాన్ని రెండురోజులపాటు గమనించి త్వరగా సాగనంపటానికి పలువిధాల ప్రయత్నాలు చేస్తారు. కాని అవేవీ సుధాకర్ మీద పని చెయ్యవు. కళ ముభావంగా ఉంటం చూసి సుధాకర్ కలవర పడ్తాడు. అతని మిత్రుడు మోహన్‌తో ఆలోచించి ఇంటికి తీసుకెళ్తాడు. అక్కడ అతనికి గీతతో పరిచయమౌతుంది. రామయ్యగార్ని చూసిన మోహన్ పారిపోతాడు. ప్రభాకర్‌ను పేరుపొందిన హస్తసాముద్రికునిగా తనతండ్రికి పరిచయం చేస్తుంది ఉష. ఆయన ఆప్యాయంగా తమయింటికి ఆహ్వానిస్తాడు. ప్రభాకర్ ప్రయాసపైన సమ్మతిస్తాడు.

[illegible]

మోహన్.

"అక్కయ్యాండి! అది మరో సినిమాకి వెళ్తానని ఈ సినిమా కొచ్చింది."

"బహుశా టిక్కెట్లు దొరికి ఉండవు. . . ." అంటూ కారణం వివరించాడు మోహన్.

"కళా, నేను ఉత్తర ధృవం, దక్షిణ ధృవం. . . అందుకే మేమిద్దరం ఎక్కడికీ కలిసి వెళ్ళం. అది మరో సినిమాకు వెళ్తానంటే నేనీ సినిమా కొచ్చాను.. తీరా చూస్తే అది ఇక్కడికే వచ్చింది. . . . !"

"వస్తే మీ సొమ్మేం పోయింది ? మీపాటికి మీరు చూశారు. ఆవిడ పాటికి ఆవిడ చూసి వెళ్తున్నది—"

"మనల్ని చూసిందేమో ?" అంటూ గీత దిగులు పడింది.

మోహన్ హుషారుగా ఈల వేశాడు.

"చూస్తే మరీ మంచిది. . . !"

"మంచిదా ?" అంటూ మురచురా చూసింది గీత.

"మంచిది కాకపోతే చెడ్డది. . . మీ ఇష్టం. . . ఏది అనమంటే అదే అంటాను.. వాడేం పోయింది ? మీ వీధి వరకూ వచ్చి దిగబెట్ట మంటారా ?"

"మీకు పుణ్యం ఉంటుంది. నా వెనకాతల రాకండి. . . ట్రాన్సిస్టర్ కోసం ఎప్పుడొస్తారు ? నాన్నగారు పగలు పదింటికి వెళ్తే రాత్రి ఎనిమిదింటి వరకు ఇల్లు చేరుకోరు ఒక్క ఆదివారంవినహాయించి. ఆలోగా మీరు నిరభాయంగా రావచ్చు. . . ." అని వెళ్ళిపోయింది గీత 'సినీ రథం' నేత పుచ్చుకుని.

* * *

అనుకున్నట్టు ఆదివారం సాయంత్రం నాల్గింటి కల్లా ప్రభాకర్ రామయ్యగారింటికి హాజరయ్యాడు.

శుభ్రంగా, నీటుగా, అందంగా, ఉత్సాహంగా కన బడుతున్న ప్రభాకర్‌ను చూసి జానకమ్మ ఆశ్చర్య పోయింది.

"సాముద్రికుడంటే విభూతి పట్టెలు, చేతిలో చినిగిపోయిన కాగితాల కట్టలు— పళ్ళూడి, నళ్ళు వంగిపోయిన ముసలాయన కాబోలనుకున్నాను. ఇంత చిన్న కుర్రాడా ?" అంది ముక్కు మీద వ్రేలేసు కుంటూ.

ప్రభాకర్ సవ్రమతగా నవ్వాడు.

"ఆ అబ్బాయి డాక్టరీ చదువుతున్నాడే. . . ఇదే పని మీద ఉన్నాడనుకున్నావా ఏమిటి ? బాగుంది!" అన్నారు రామయ్యగారు.

"మా శకుంతల అన్నయ్య పేరేనే. . ." అని పరిచయం చేసింది ఉష.

జానకమ్మ మరీ ఆశ్చర్య పోయింది.

"అలాగా ! నాతో మీరూ చెప్పందే ?" అంది.

"మీరు మొదట మా ఆవిడ చెయ్యి చూడండి. మా సంగతి చెప్పిన దగ్గర్నించీ ఆవిడ నన్ను నిలబడి నీళ్ళు తాగనీయటం లేదు. జాతకం, సాముద్రికం చూసే నాళ్ళేవరూ కనబడకపోతే చివరకు సోద్దైనా చెప్పించుకుంటేనే కాని ఈ ఆవిడకు నిద్రపట్టటు." అన్నారు రామయ్యగారు.

"చేతుల్లో ఉడా, మొగా తేడాలుంటాయా ? ఏమో గొడవ ? పుస్తకంలో అలా ఏం రాయలేదు. అయినా రోటికో చల దూర్చి రోకటి పోటుకు

[...]కున్నాడు ప్రభాకర్.

అంతా డ్రాయింగ్‌రూంలో గుమికూడారు. ప్రభాకర్, రామయ్యగారు సోఫాలో కూర్చున్నారు. జానకమ్మ కుర్చీ సోఫా ముందుకు లాక్కుని కూర్చున్నది. గీత, చిత్ర, శారద సోఫానానుకుని నిల బడ్డారు. కళ, ఉష తల్లి కుర్చీ నానుకుని నిలబడ్డారు. ప్రభాకర్ ఏం చెప్తాడో విందామని అంతా ఆసక్తిగా ఎదురు చూస్తున్నారు. ప్రభాకర్‌కు ఒక్క క్షణం వణుకొచ్చింది. . . .

"చెయ్యి చాపండి. . . ." అన్నాడు ప్రభాకర్.

జానకమ్మ చేయి సాచింది.

"కాస్త పౌడరు పూసుకురండి. . ."

జానకమ్మ అయోమయంగా చూసింది.

"నాకు పౌడరు రాసుకోవటం అలవాటు లేదు బాయనా. . పౌడరు అద్దుకుంటేనే గాని చెయ్యి చూడ్డానికి వీలుకాదా ?"

ప్రభాకర్‌కు నవ్వొచ్చినా ఆపుకున్నాడు.

"మొహానిక్కాదండి. . . చేతిలో రేఖలు స్పష్టంగా కనబడతాయని చేతికి పూసుకోమంటున్నాను. . ."

"అలాగా !" అంటూ జానకమ్మ తేలికపడి చేతికి పౌడరు పూసుకొచ్చింది.

ప్రభాకర్ స్టడీ చేయటం మొదలు పెట్టాడు. కాస్సేపు చెయ్యి అటూ, ఇటూ పట్టుకుని "అరరే! ఇదేమిటండీ ? మీ ఆరోగ్యం ఇంత అధ్వాన్నంగా ఉన్నది ?" అన్నాడు.

"ఎంత బాగా చెప్పావు నాయనా ! నేను ఒక రోజు లేస్తే మూడు రోజులు పడుకుంటాను. ఈ మధ్య మరీని. . ." అంది జానకమ్మ ప్రభాకర్ పైపుణ్యానికి ఆశ్చర్యపోతూ, మురిసిపోతూ.

"అది చెయ్యి చూసి చెప్పేదేమిటి ? మా అమ్మ ముఖం చూసే చెప్పొచ్చు. . ." అని కిసుక్కున నవ్వింది చిత్ర.

రామయ్యగారు చీవాట్లేశారు.

"నీకు నమ్మకం లేకపోతే అవతల కెళ్ళవే. . . . ముఖం చూస్తే ఏం తెలుస్తుంది ?. . దాని మాటలు పట్టించుకోకండి !" అంటూ రామయ్యగారు ప్రభాకర్‌ను వెనకేసుకుని వచ్చారు.

అయినా ప్రభాకర్‌కు కోపం వచ్చింది.

"చూడండి ! ఈ రేఖ ఎంత గజిబిజిగా ఉన్నదో ? ఇలా ఉంటే ఆరోగ్యం సరిగా ఉండదన్న మాట. ."

"సరే ! ఆ తర్వాత చూడండి !" అని జానకమ్మ తొందర పెట్టింది. ఏ రేఖ ఎలా ఉంటే తనకెందుకు ? ఫలితం కావాలికాని. . . . .

ప్రభాకర్ మళ్ళా చెయ్యి చూసి "మీ చేతిలో క్రాసు ఉన్నదే ?" అన్నాడు గాభరాను మాట జారుతూ.

"ఉంటే ఏమిటి ?" అనడిగారు రామయ్యగారు ఆతృతగా. ప్రభాకర్ చెప్పటానికి తటపటా యించాడు.

"చెప్పవోయ్, ఫర్వాలేదు ! మంచి దైనా, చెడ్డ దైనా మేం ఏమీ అనుకోం. . ." అంటూ రామయ్య గారు ప్రభాకర్ భుజం తట్టారు.

"మరేమీ అనుకోకండి! ఈ వయోంటులో క్రాసు ఉంటే. . . ."

"ఉంటే ?"

అన్నాడు ప్రభాకర్, నోరెందుకు జారావా అని లోలోన మథన పడుతూ. బోడమ్మలా రామయ్యగారు ఎన్ని తిట్లు తిడతారో ? ఆవిడంటే అరవంలో తిట్టింది కాబట్టి తనకు బోధపడలేదు. బోధపడక బాధపడలేదు. ఈయన అచ్చంగా తెలుగులో తిడితే— అదీ ఇంత మంది అమ్మాయిల ఎదుట— తిడితే తన్ను కాదని ఎలా దులిపేసుకోవటం ?

రామయ్యగారు ప్రభాకర్ చెయ్యి గట్టిగా నలి పేస్తూ "బ్రహ్మాండంగా చెప్పావయ్యా ! ఎంత మందో చెప్పారు కాని ఈ ముక్క ఒక్కళ్ళూ చెప్ప లేదు . . ." అన్నారు.

నిజమా ? కలా ? అనుకుంటూ ప్రభాకర్ రామయ్యగారి వంక గుడ్లప్పగించి చూశాడు.

"నూటికి నూరుపాళ్ళు నిజమేనయ్యా ! మా ఆవిడా వాళ్ళు అద్దెకున్న పక్కింట్లోనేనుండే వాడిని. . . చదువు కోసం మేడ మీది గది అద్దెకు తీసుకున్నా నులే. ప్రొద్దున్న ఏడు గంటల వేళ నేను పక్క మీద నుంచిలేచి కిటికీదగ్గర కెళ్ళేవాడిని.. మా ఆవిడ వాళ్ళ దొడ్లో కరివేపాకు కోస్తూ ఉండేది ఆ సమయంలో. నే నొక వేళ కాస్త ముందు లేచినా ఆవిడ కరివేపాకు ఎప్పుడు కోస్తుందా అని కనిపెట్టుకుని కూర్చునే వాడిని. రోజూ ఆవిడ్ని చూడకుండా మాత్రం నిద్ర పోయే వాడిని కాదు. . . మా ఆవిడ కప్పుడు పదేళ్ళ కన్నా ఎక్కువ ఉండదు. నాకు పదహారేళ్ళుంటాయి; ఎస్. ఎస్. ఎల్. సి చదువుతుండే వాడిని. . ఆ ఏడాది పరీక్ష పల్టీ కొట్టిందిలే. . . ."

జానకమ్మ సిగ్గుపడింది.

"ఆ విషయాలన్నీ అబ్బాయి కెందుకండీ ?"

రామయ్యగారు వినిపించుకోలేదు.

"ఆ తర్వాత మా వాళ్ళు నా సంగతి తెలుసు కుని వాళ్ళ వాళ్ళతో మాట్లాడి పెళ్ళి చేశారు. . . ఎంత కరెక్టుగా చెప్పావయ్యా కళ్ళతో చూసినట్టు !"

రామయ్యగారు ఆశ్చర్యంతో తల పుంకలయ్యారు.

కళ నవ్వింది.

"ఆయన చూస్తున్నది అమ్మ చెయ్యిగా ? మీరు మీ సంగతి చెప్తారేమిటి మధ్య ?"

"ఇద్దరిలో ఎవరు ప్రేమించినా అది లవ్ మేరేజి క్రిందే లెక్కకొస్తుంది. . . మొగుడూ పెళ్ళాల చేతుల్లో ఎవరిదో ఒకరిది చూస్తే సరిపోతుంది. మళ్ళా రెండో వాళ్ళ చెయ్యి చూడ నక్కర్లేదు. . . అన్ని విషయాలు అందులోనే ఉంటాయి. . ."

"ఇదీ బాగానే ఉన్నది ! డబ్బిచ్చుకునే పక్షంలో డబ్బు మిగులుతుంది. . . ఎవరో ఒకళ్ళు డబ్బిచ్చి చూపించుకుంటే సరిపోతుంది. . ఒకే దెబ్బతో రెండు పిట్టలు !" అని పకపక లాడింది గీత.

ఈ గడుగ్గాయి పిల్లలందరి మధ్యకి తనను ఈడ్చుకొచ్చి పడేసింది. ఇప్పుడు బుద్ధిమంతురాలికి మల్లే మాట్లాడకుండా కూర్చున్నది ఉష. కానీ. .. ఈసారి మళ్ళా ఒంటరిగా కనబడక పోతుందా ?

ప్రభాకర్ ఏం తోచక జానకమ్మ చేతిలో ఒక రేఖ చుట్టూ వ్రేలితో గీశాడు.

రామయ్యగారు ఆతృతగా అడిగారు "ఆ రేఖే మిటి ?" అని.

"నా తలకాయ రేఖ" అని స్వగతం చెప్పుకుంటూ పైకి "ఫారిన్ రేఖ" అన్నాడు ప్రభాకర్.

# అయిదు వేళ్ళు

"ఏమిటి . . . ? మా ఆవిడ ఫారిన్ కూడా వెళ్తుందా. . . . ?" అంటూ రామయ్యగారు విస్తుపోయారు.

ప్రభాకర్ నిర్లక్ష్యంగా తల తిప్పి అన్నాడు.

"ఈ రోజుల్లో తలుచుకుంటే ఆకాశంలో కూడా ఎగిరి పోవచ్చు. . . అదేమంత బ్రహ్మాండమైన పని ?"

"ప్రాణాల సంగతేనా బాబూ నువ్వనేది ? అవి ఎప్పుడెగిరిపోతాయో చెబుదూ ? దినదిన గండం నూరేళ్ల ఆయుష్షుగా నడుస్తున్నాయి రోజులు . ." అంది నీరసంగా జానకమ్మ.

"ప్రాణాల సంగతి కాదండీ నేనన్నది. . . నిజంగా రష్యా వాళ్ళు ఆకాశాన్నిచూసి వస్తున్నారు. . ఈ మధ్యనే ఒకమ్మాయి కూడా ఆకాశాన్ని ఎక్కి వచ్చింది. . . ."

"అమ్మాయి అనేటప్పటికి ఎంత తేలిగ్గా చెప్పేస్తున్నారండి ఏదో నిచ్చెనెక్కి దిగినట్టు !" అంది చిత్ర కోపగించుకుంటూ.

రామయ్యగారు విస్మయంలో నుంచి తేరుకుని "మా ఆవిడ ఫారిన్ వెళ్తే ఆవిడ వెనకాతల నేనూ, మా పిల్లలో వెంట వెళ్లాల్సిందే మరి ! ఎవరూ తోడు లేకుండా ఆవిడ ఫారిన్ కాదు కదా పొరుగూరికైనా వెళ్ళదు. . . అంత దాకా ఎందుకు గుమ్మం దాటి అడుగు పెట్టదు. . . ." అన్నారు.

"ఏమో ? మీరంతా కలిసే వెళ్తారేమో ఎవరు చూపొచ్చారు ?" అన్నాడు ప్రభాకర్.

రామయ్యగారు, అమ్మాయిలు అంతా ఒకేసారి ఆత్రుతగా.

"మాకా రేఖ ఉన్నదేమో చూడండి !" అంటూ చేతులు ముందుకు సాచారు. అందరికీ ఆ రేఖ కాస్తో, కూస్తో ఉన్నది. చూస్తూ ఉంటే అది ఫారిన్ రేఖ అవునా, కాదా అని ప్రభాకర్‌కు అనుమానం వేసింది. అయినా ఏమాత్రం జంకకుండా "అందరికీ ఉన్నది.. మీరంతా కలిసి వెళ్తారు. . సందేహం లేదు !" అన్నాడు.

ఆ మాటకొస్తే తనకీ ఆ రేఖ ఉన్నదని చెప్పాడు.

"ఫారినంటే ఏ దేశం వెళ్తామో చెప్పండి !" అంది గీత ఉత్సాహంగా.

అడిగే వాడికి చెప్పేవాడు లోకువ !

"అవన్నీ సాముద్రికంలో తెలియవు లెండి. . . . మీకా వివరాలన్నీ కావాలంటే భృగునాడి చూపించుకోండి. . ." అన్నాడు. ప్రభాకర్.

"అదేమిటి ? ఆ పేరు నేను ఎప్పుడూ వినలేదే?" అని ఆశ్చర్యపోయింది గీత.

"నాకూ ఏమంత తెలియదు లెండి. నా స్నేహితుడొకడికి భృగునాడి అంటే తగని వెర్రి. . ఋషులు రాబోయే సంగతులన్నీ కట్టలు కట్టలుగా రాసి పడేశారట. అవి చూసుకుంటే అందులో మనతండ్రి, తాతల పేర్ల దగ్గర్నించి అన్నీ వివరంగా ఉంటాయట. . ."

"అవి ఎక్కడుంటాయి ?" అనడిగింది కళ ఆత్రుతగా.

"సాముద్రికం చెప్పేవాళ్ళలాగే వాళ్ళు కూడా కనబడతారు లెండి, రోడ్డువెంట వెతుక్కొంటూ వెళ్తే. . . ."

"తండ్రిపేరు రామయ్య, తల్లిపేరు జానకమ్మ అని తెలిస్తే మాత్రం ప్రయోజనం ఏమిటండీ ? ముందు సంగతులేవైనా తెలుస్తాయా ?" అనడిగింది చిత్ర.

"తెలుస్తాయట. . . అవన్నీ ఒకే పుస్తకంలో ఉండవట. ఆ పుస్తకాలు పట్టుకొచ్చున్న వాడికి ఒక్కో పుస్తకం తిరగెయ్యటానికి కాస్తో కూస్తో అడగడట. ఒక పుస్తకంలో మీక్కావలసిన సంగతి రాలేదనుకోండి. మళ్ళా డబ్బిచ్చి మరొకటి చూపించుకోవాలి. . డబ్బివ్వగలిగే శక్తి ఉంటే అవన్నీ ఒకదాని తర్వాత మరొకటిగా చూపించుకుంటూనే ఉండొచ్చు. . . ."

"అదేమిటండీ ! మన గురించి అంతా ఒక పుస్తకంలో రాయకుండా ఇందులో కొంత, అందులో కొంత రాయటం ఎందుకో ?. . . ఈ పుస్తకంలో తల్లి తండ్రుల పేర్లు వచ్చాయి కదాని మరో పుస్తకం చూపించుకుంటే అందులో మీకు పుట్టబోయే పిల్లల పేర్లు రామారావు, రంగారావు అని ఉంటాయేమో ?" అని నవ్వింది చిత్ర.

"అబ్బో ! భృగునాడి డబ్బుతో కూడిన వ్యవహారం !" అంటూ రామయ్యగారు మరింక ఆ టాపిక్ మీద మాట్లాడనీయలేదు.

"ఫారిన్ వెళ్తే అక్కడ ఆవకాయ లేకుండా తినటం ? జాడీలతో పట్టుకెళ్ళినా ఆ చలికి చెడిపోతుందేమో ?" అని అనుమానం వెలిబుచ్చింది గీత.

కళ నవ్వింది.

"జాడీలో నుంచి ఎర్రగా నూనె కారుతూ ఉంటే ఎవడినో ఖూనీ చేసి పారిపోతున్నారనుకుని సరాసరి జైలుకు తీసుకెళ్ళగలరు . . . !"

"ఆవకాయలవీ తినటం చేతనే మనకీ జబ్బులు ! యూరోపియన్లు చూడండి ఎంత బలంగా ఉంటారో ?" అన్నాడు ప్రభాకర్.

రామయ్యగారు ఆలోచనలతో సతమత మవుతూ "మీరు చెప్పింది ఇక ముందు వెళ్లటం అయి ఉండదు. . . ఇది వరకూ మాకే రేఖలో కనబడి ఉంటుంది. . ." అన్నారు.

ప్రభాకర్ విపరీతంగా ఆశ్చర్య పోయాడు.

"ఏమిటి ? ఇదివరలో ఒకసారి ఫారిన్ వెళ్లొచ్చారేమిటి ?"

"ఫారిన్ అంటే ఏమిటయ్యా పరాయి చోటే కదా ? తెలుగు గడ్డ మీది నుంచి తమిళ నాడు కొచ్చి పడ్డామంటే మరేమిటి ? అందుకే మనందరి చేతుల్లోనూ ఆ రేఖ కనబడుతున్నది. . . ఆ రేఖ అర్థం అదేనయ్యా ! నాకు బోధ పడింది. . . ." అని రామయ్యగారు టీక చెప్పారు రేఖలో కిటుకును ఇట్టే తెలుసుకున్నందుకు సంతోష పడుతూ.

బ్రతుకు జీవుడా అనుకున్నాడు ప్రభాకర్. ఇలాంటి వాళ్ళు ఏ కొద్ది మంది ఉన్నా సాముద్రికుల పంట పండినట్టే అనుకున్నాడు.

ఉన్నట్టుండి జానకమ్మ "మా అమ్మాయిలందరికీ మంచి సంబంధా లొస్తాయా ? తొందర్లో పెళ్ళిళ్ళు అవుతాయా ?" అని అడిగింది.

"తొందర్లోనే అవుతాయి. . విక్టోరియంలాంటి

అల్లుళ్ళొస్తారు కదా. మరేమీ గాభరా పడకండి..." ధైర్యం చెప్పాడు ప్రభాకర్ ఉష వంక దొంగ చూపులు చూస్తూ.

తర్వాత ప్రభాకర్ దారం ఉండ తెమ్మన్నాడు. పావలా జానకమ్మ చేతిని అటుపెట్టి, ఇటుపెట్టి వేలుగోళ్ళదుసార్లు కొలిచి అదారాన్ని అక్కడ గుర్తుగా తెంపాడు.

"ఏమిటేమిటి. . . ?" అనడిగారు రామయ్యగారు ఆతృతగా.

"ఇప్పుడు కాదండి. . . సావధానంగా ఆలోచించి చెప్పాలి. . . !" అంటూ దాన్ని జేబులో పడేసుకున్నాడు ప్రభాకర్ అలసటగా.

"అలాగే ! ఇప్పుడేం తొందరలేదు నాయనా. ." అంటూ రామయ్యగారు కాఫీ, టిఫిన్ తీసుకురమ్మని అమ్మాయిలకు పురమాయించారు.

ఉష చురుగ్గా లోపలికెళ్ళి కాఫీ, టిఫిన్ తీసుకొచ్చి బల్లమీద పెట్టింది. . .

ప్రభాకర్ వెళ్తున్నప్పుడు రామయ్యగారు "ఏ.ళ్లా ఎప్పుడొస్తారు?...అప్పుడప్పుడు వస్తూ ఉంటారు కదూ ?" అన్నారు అవ్యాజ్య ప్రేమను కురిపిస్తూ.

"తప్పకుండా వస్తానండీ! మీరు మరీ చెప్పాలా?" అంటూ సెలవు తీసుకున్నాడు ప్రభాకర్.

రామయ్యగారిల్లు కనుమరుగు కాగానే జేబులోనుంచి దారం ముక్కను ఇవతలకు తీసి పారేశాడు. పుస్తకంలో ఇచ్చిన కొలత ప్రకారం లేదు ఆవిడ చెయ్యి. . ఏం చేయటం మరి ? ఈ సారి అడిగితే ఏవో నాలుగు కోతలు కోస్తే సరిపోతుంది...

# 6

సుధాకర్ మంచం మీద నిటారుగా పడుకుని, దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. ఇల్లు విడిచి వచ్చి పది రోజులు దాటింది. సంతోషంగా వచ్చి కొండంత సంతాపాన్ని మోసుకుపోతున్నాడు. . . . ఇంక మద్రాసులో ఉండి మాత్రం ఏం ప్రయోజనం ?

కళ ! ఫలించని కల !

ఎంత తొందరగా మద్రాసును దాటితే అంత తొందరగా కళను మర్చిపోవచ్చు. కనీసం మర్చి పోవటానికి ప్రయత్నించవచ్చును... రాత్రి ప్రయాణం కట్టాలని తీర్మానించుకున్నాడు సుధాకర్. . .

గుమ్మం దగ్గర కిలకిలా నవ్వు వినిపించేసరికి సుధాకర్‌కు షాక్ తిన్నట్టు అనిపించింది.

"మీరేమో ఆరడుగులు, మంచమేమో అయిదడుగులు. . మీ కాళ్ళు ఇవతలకు వ్రేలాడుతుంటే నాకు. . ."

"వాట్ ?" అంటూ రబ్బరు బంతిలా ఇంతెత్తున ఎగిరి సుధాకర్ హఠాత్తుగా మంచం మీదనుంచి లేచి కూర్చున్నాడు. . కళ. . ! సుధాకర్ షాక్ నుంచి తేరుకోలేక బిత్తర చూపులు చూసేసరికి కళ మరింత పకపక లాడుతూ నవ్వింది.

"ఎందుకలా చూస్తారు ? చిన్నప్పుడు 'అందరికీ సరిపోయే మంచం' అనే కథ చదివాను లెండి. అందులో ఒక రాక్షసి దారిని పోయే వాళ్ళందరినీ తన ఇంటికి ఆహ్వానించి వాళ్ళకు సకలోపచారాలు చేసేదట. ఆ అభాగ్యుడు మంచం కన్నా పొట్టిగా ఉంటే వాడి కాళ్ళు మంచం కొసవరకు సాగదీసి చంపేసేదట. వాడు కనక మంచంకన్నా పొడుగ్గా ఉంటే వాడి కాళ్ళను మంచం పొడుగుతో సమానంగా నరికేసి తినేసేదట. . ."

సుధాకర్ ఇప్పటికి తెప్పరిల్లాడు.

"నయం ! ముందరే చెప్పారు ..... ! మీరు కత్తి పుచ్చుకుని వచ్చేలోగా నేను ఉడాయిస్తే కాని ప్రాణాలు దక్కవు .... !" అంటూ లేచి నిలబడ్డాడు.

"నేను మీ కంటికి రాక్షసిలా కనబడుతున్నా నన్న మాట !" అంటూ కళ మూతి ముడుచుకుంది.

"మీరు లక్షణంగా ఉన్నా మీ మనస్సులో మాత్రం రాక్షసత్వం గూడు కట్టుకుని ఉంది .... కాకపోతే ఇన్నాళ్ళు నన్నింత ఏడ్పించారు ? ఇలా వచ్చి పలకరించి ఎన్నాళ్లయింది ? .... ఇప్పటికైనా కోపం తగ్గిందా ? .... అయినా అంత కోపం ఎందుకొచ్చింది ....?"

"కోపం కాదులెండి .... మీకేం తెలీదు .... ఆ ! మీకోసంగతి చెప్పటం మర్చిపోయాను.... మేమంతా రెండు, మూడు రోజుల్లో వైజాగ్ వెళ్తున్నాం ..." అంది కళ దిగులుగా.

"నేనూ రాత్రికి బయల్దేరి వెళ్తున్నాను...."

"ఎలా వెళ్తారో నేనూ చూస్తాను .... మరో రెండురోజులుంటే అందరం కలిసి ఒకే మెయిల్లో బయల్దేరి వెళ్లొచ్చు...."

---

పేరయ్య : నమస్కారం డాక్టర్‌గారూ ! మీరు చేసిన ఉపకారానికి కృతజ్ఞత.

డాక్టర్ : నేను నీకు ఎప్పుడూ వైద్యం చెయ్యలేదే ?

పే : నాక్కాదండి; మా మామగార్కి వైద్యం చేసి సాగనంపారు. మీ ధర్మమా అని ఆయన ఆస్తంతా నాకే కలిసింది.

కె. రంగారావు (కాకరపర్రు)

---

"వైజాగ్‌లో ఎవరున్నారు ?" అనడిగాడు, సుధాకర్ కుతూహలంగా.

"ఎవరేమిటి ? మా మేనత్త ఉన్నది .... మా బావ ఉన్నాడు...."

"హరి భగవంతుడా ! మీ మేనత్తకో కొడుకు కూడా ఉన్నాడూ ?" అంటూ నీరసంగా కూలబడ్డాడు సుధాకర్.

"ఉంటే మీ సొమ్మేం పోయింది ? ఆవిడ ఆస్తిలో మీకేమైనా వాటా తగ్గుతుందా ఏమిటి ? మధ్య మీకేమిటా కంగారు ? బావ అనగానే అలా బెంబేలు పడిపోతారేం ?"

సుధాకర్ గుండెలు నిమురుకున్నాడు.

"మీరభయం ఇస్తే నాకు కంగారేమిటి ? ఇంతకీ మీ బావ ఒకటో క్లాసో, రెండో క్లాసో చదువుకుంటున్న చిట్టిబావా ?"

"అదేం కాదు ! నాకంటే రెండేళ్ళు పెద్ద...."

సుధాకర్ కెవ్వుమన్నాడు. కాస్సేపు తలచేత్తో పట్టుకుని కూర్చున్నాడు. తర్వాత గభాలున లేచి తోలుపెట్టెతీసి బట్టలన్నీ బైటికి తీసి మళ్ళా సర్దటం మొదలుపెట్టాడు.

"మీతో మాట్లాడలేదని అన్నారుగా.....? మీకిప్పుడు కోపం ఎందుకొచ్చిందో నాకూ అందులే వచ్చింది........."

సుధాకర్ చేతులు చటాలున పని చేయటం ఆపేశాయి. కళవైపుకు తిరిగి ఆశ్చర్యంగా చూస్తూ నవ్వి అన్నాడు.

"ఎంత చక్కగా డిమాన్‌స్ట్రేట్‌చేసి చూపించారండి..............!"

"కాఫీ తీసుకొస్తానుండండి......." అని కళ వెళ్లబోయింది.

"నో ! నో ! థేంక్సు.......తాగే వచ్చాను....."

"అదికూడా ఎప్పటినించి ?" అంటూ కిలకిల లాడింది కళ.

"భలేవారే! కాఫీమాట నేనన్నది......మీరు వద్దన్న దగ్గర్నించి సిగరెట్లు కూడా మానేశాను.... అయినా మీరిప్పుడు/ కాఫీ తయారుచేయబోయి చేతులు కాల్చుకున్నారంటే నేను ఏ డాక్టర్ కోసమో పరిగెత్తాల్సి ఉంటుంది......"

"చాల్లెండి....! నాకేం వంట రాదేమిటి.....?"

"రాకేం? నేనువచ్చిన కొత్తలో మీరు స్వయంగా మీ చేత్తో నాకు వంటచేసి పెట్టారుగా ?"

కళ సిగ్గుపడింది.

"మిమ్మల్ని చాలాబాధపెట్టానుకదూ...?"అన్నది.

"బాధ అని మెల్లిగా అంటారేం ? యమయాతన పడ్డాననుకోండి...నేను నిక్షేపంలా హొటల్ కెళ్లి భోంచేసి వచ్చేవాడిని.... మీరు పాపం పస్తుపడుకుంటే నా ప్రాణాలు గిలగిలలాడేవి...."

కళ మాట్లాడకుండా లోపలికెళ్లి కాస్సేపటిలో కాఫీతో తిరిగివచ్చింది. వద్దంటూనే సుధాకర్ కప్పు అందుకున్నాడు.

కాఫీ కప్పు పెదాల దగ్గర ఉంచుకోబోతూ సుధాకర్ "నేనొక మాట అడుగుతాను.....జవాబు చెప్తారా ?" అనడిగాడు.

"యక్ష ప్రశ్న అడగరుకదా......?"

"నో ! నో ! బహు సూక్ష్మ ప్రశ్న ?"

"అడగండి !"

"మీకు .... మీకు ...."

"మీరు మద్రాస్‌లో ఏమేం చూశారు ?" అనడిగింగింది చటాలున కళ.

"నిజం చెప్పమంటారా ?"

"అబద్ధమాడి నమ్మించగల ననుకుంటున్నారా?"

అని పక్కుమంది కళ.

"నేను మద్రాస్ రావటం ఇది మూడోసారి ..."

కళ ఆశ్చర్యపోయింది.

"మరి డబ్బు ఎక్కువై వచ్చారా .... ?"

"మిమ్మల్ని చూద్దామనే వచ్చాను... నా స్నేహితుడు రామయ్యకి పంచరత్నాల్లాంటి అమ్మాయిలున్నారు. వాళ్ళకి ప్రయత్నాలు చేస్తున్నారట. నువ్వోమాటు వెళ్లి చూసొచ్చావా ?" అనడిగారు మా నాన్నగారు .... వెంటనే పెట్టె సర్దుకుని ఇలా బయల్దేరి వచ్చేశాను .... మరి ఇప్పుడు చెప్పండి .... నేనంటే మీ కిష్టమేనా .... ?"

కళ చటుక్కున చూపులు మరల్చి నాలిక జోరుగా అల్లల్లాడించి అక్కడనుంచి వెళ్లిపోయింది.

ఆడవాళ్ళు అవునంటేకాదు, కాదంటేఅవును....నాలిక కదిలికలు తిప్పితే..?'ఆడవాళ్లభావంతెలుసుకోవటానికి ఏంచదువుకోవాలి?'అనుకున్నాడుసుధాకర్. (సశేషం)




[గత సంచిక తరువాయి]

భీముడు కథ చెపుతున్న వేళ మా గదిపై కప్పు మీద రాళ్ళ వానతోపాటు వడగట్ల చప్పుడౌతోంది! శిష్యుడు కూడా కాస్త దగ్గరిగా జరిగాడు. భీముడు కె. శి. సర్కిల్ ఇన్‌స్పెక్టర్ గారి కథ చెప్తున్నాడు: నాయుడుగారు విశాఖపట్నంలో ఉన్నాట్ట అప్పుడు.

"భస్మ్! దెయ్యాల్ని నమ్మను" అనేవాట్ట! ఒకసారి ఒక ఆడకూతుర్ని పోలీసులు దొంగతనం చేసిందని పట్టుకున్నారు. ఆవిడ మర్నాడు స్టేషన్లో నాకు ఏమీ తెలియదు అని ఏడ్చింది. కాని నాయుడుగారు ఒప్పుకోలేదు. పాపం! ఆవిడ భర్త వచ్చి "బాబూ! పిల్లలవాణ్ణి! కలో గంజో పెళ్ళాం పిల్లలకు పోసి పోషించుకోగల వాణ్ణి.. అది మా ఆవిడ తీసింది నిజమే కాని.. దానికేం తెలియదు. ఈ మధ్య ఒక దెయ్యం నా ఇల్లాల్ని పట్టి పీడిస్తున్నది. . . . ఆ దెయ్యం చేసిన పనే ఇదని" మొరపెట్టుకున్నాడు.

ఆ 'యిల్లాలు' (దెయ్యం) పక్కింటి డాబామీది వొడియాలు అప్పడాలు—వేసిన పళ్ళాలు వేసి ఉండగానే తెచ్చేసిందిట!—

కాని నాయుడు "దెయ్యాలు గియ్యాలు లేవు దొంగవేషాలు, దెయ్యం గియ్యం ఉంటే పోలీసులెందుకు ఇంక?" అన్నాడు— జుల్మానా వేయించాడు.

నాయుడి కూతురికి— ఇప్పుడు సినిమాలో తన వయసు 'ఇరవై ఆరు' అని బుకాయిస్తున్నదానికి అప్పుడు ఇరవై ఏళ్లు ఉంటాయి. పదిహేనేళ్ళ క్రితం అన్న మాట!

నాయుడు దెయ్యాల గురించి ఎంత ఈసడింపుగా మాట్లాడుతాడో తెలిసిన పోలీసులకి కూడా ఒక్కోసారి నాయుడి మీద ఏ దెయ్యాన్నో మహంతి మరిడయ్యకు చెప్పి వదిలిపెడ్తామా? అని ఉండేదిట!

నాయుడు ఆ వూరు నించి ఇక బదిలీ అవుతాడనగా ఒక విచిత్రమైన సంఘటన జరిగింది— గొప్ప వెండి బంగారు నగల వర్తకుడు సుబ్రహ్మణ్య శ్రేష్ఠిగారింట వజ్రాల ఉంగరం పోయింది!

అది రిపోర్టు చేశారు— నాయుడు ఇంటికి వచ్చాడు. పెళ్ళాం స్వర్గస్థురాలైందిమొదలు కూతురే తనకి సర్వస్వమూ— "కుమారీ" అని కేక వేశాడు.

కాఫీ కప్పుతో వచ్చింది కుమారి. సిల్కని చీర కట్టుకుంది. జుట్టు విరబోసుకుని ఉంది!

కప్పు అందుకుంటూనే "తలంటుపోసుకున్నావే తల్లీ?" అందామనుకున్నాడు నాయుడు కాని అంతలో గతుక్కుమన్నాడు. కుమారి చేతి చూపుడు వ్రేలికి "దుక్కం"త వజ్రపుటుంగరం! నాయుడు గుండెలు జారిపోయాయి!

"అదేంటమ్మాయ్?" అన్నాడు గద్దించి

"మందేలే నాయనా! కొట్టుకొచ్చాం....." అంది కుమారి. నవ్వుతోంది కుమారి. ఆ నవ్వుతో వికటముంది. విస్ఫోటముంది. వికారముంది!

నాయుడు కప్పు అక్కడ పారేసి కూతురితో పాటు మేడమీదికి పరిగెత్తాడు.

గదిలోకి వెళ్ళిపోయింది కుమారి.

"తల్లీ! కుమారీ! తలుపుతియ్యి" నాయుడు చెమటలు ఒత్తుకుంటున్నాడు. సాపాలు తలుపు కొట్టాడు. తలుపు తియ్యలేదు కుమారి.

ఫ్ఫై.. మేడక్రిందనుంచి కేక వేసింది. "నాయనా! మీకోసం శెట్టిగారొచ్చారు, రా?"—

అది కుమారి గొంతే. కంచు గంటలా ఖంగుమంది. నాయుడు గుండెలు పగిలిపోతున్నాయి. ఇదెలా సాధ్యం అనుకుంటూ క్రిందికి వచ్చాడు— ఉంగరం వేలు వయ్యారంగా నొక్కుకుని వేసుకుని కుమారి—ఎదురుగా నిప్పులు క్రక్కుతూ—బుసలు కొడుతున్న పాములా శెట్టిగారు.

నాయుడు పెదాలు తడిచేసుకుని కుమారిని దగ్గరిగా వెళ్ళి "తేన్క్స్" అని సౌమ్యంగా అంటూనే బలవంతానా ఆ చెయ్యి పట్టుకుని ఉంగరంలాక్కుని శెట్టిగారి వేపు తిరిగి "నమస్కారం సార్! మీ ఉంగరం దొరికింది! ఇదేనా?" అంటూ అందించి— కుమారికేసి తిరిగి "కాఫీ తేమ్మా" అని కేకేసి ఉస్సురన్నాడు. కుమారి వయ్యారంగా వెళ్లింది.

"మా అమ్మాయి సరదాపడి పోసారెట్టుకుంది" అన్నాడు. లక్షరూపాయిలిచ్చినా నాయుడు అంత కంటే బాగా నటించలేడు. ఆ మాట నాయుడే అన్నట్టు! శెట్టి ఆ మాటలు తప్పనిసరిగా నమ్మాడు.

కుమారి నవ్వు గలగలా ఇల్లు మారు మ్రోగింది. నాయుడికి ఆ ఒక్క గండం ఎలాగో గడిచింది— కాని అటు తర్వాత ఆర్నెల్లు కుమారి— నాయుడి చేత మూడు చెరువుల నీళ్ళు త్రాగించిందట.

కుమారి వీధిలోకి వెళ్ళి వస్తున్నప్పుడు సాధార్ణంగా నల్లని సిల్కుచీర కట్టుకుని వచ్చేది. హేండ్ బాగ్‌లో రోజు కో నగో, వంద రూపాయల నోటో వేసుకుని మరీ వచ్చేది! నాయుడు ఆత్మహత్య చేసుకుందామనుకున్నాడు. కూతురికి మతి భ్రమించిందనుకున్నాడు. పెళ్ళి కవాల్సిన పిల్ల. కడుపు చించుకుంటే కాళ్ళమీదే పడుతుంది! కుమారిని చాలా మంది మామూలు మనిషే అనుకునేవారు. పైగా మరీ వొయ్యారాలు చిలుకుతూ వుండేదిట.

రహస్యంగా డాక్టర్లకి చూపించాడు. వాళ్ళు మంత్రాలు వేయించమన్నారు. నాయుడు మండి పడ్డాడు— సైన్సు మంట గలిసిం దన్నాడు.

కూతుర్ని గదిలో పెట్టి దానికి జైలు ద్వారాలకి వేసినంత తాళం కప్పువేసి ఇద్దరు పోలీసులను మంచి బలమైన వాళ్ళని కాపలా పెట్టాడు.

ఒక నాడు లోపల కుమారి శ్రావ్యంగా పాడుతోంది. బయట వాన పడుతోంది! కుండపోతగా కురుస్తోంది. పాట వాన చప్పుడు చీల్చుకొని నాయుడు చెవుల్లో గింగురుమంటున్నది.

"ఉసిరికాయలు దొంతులుగ పెట్టగనేర్తూ...
బోడితల నంటగ నేర్తూ. . .
మొగలాయీ దర్బార్ నేలగ నేర్తూ. . . .
సీతా రాముల నెడబాయగ నేర్తూ
నాయుడు తల నున్నగ చేయుగ నేర్తూ ...."

అని పాడుతూనే ఉంది కుమారి. నాయుడికి పీడ కలలాగ గడిచింది ఆ రాత్రి.

మర్నాడు తెల్లవారక మునుపే పోలీసుల్లో ఒక్కడు పరారీ అయ్యాడు రెండోవాడు నాయుడి దగ్గరికి వచ్చి ఏడుస్తూ గోల పెట్టేశాడు—

రాత్రి తను గది గుమ్మంలోనే పడుక్కున్నట్టు — బాగా జ్ఞాపకం. రెండోవాడితో కబుర్లు చెబుతూ నిద్రపోయాడట — కాని అప్పుడు తెలివి వచ్చి చూసుకుంటే, వానలో తడుస్తూ ఇంటిప్రహరీ పిట్టగోడమీద పడున్నాడట!

"సార్! పిల్లలవాణ్ని! దెయ్యాలతో పేచీవద్దు సార్! మీ కాళ్ళు పట్టుకుంటా" నన్నాడు వాడు. ఏడిచాడు.

నాయుడికి కోపం దుఃఖం ముంచుకు వచ్చాయి హంటర్ తీసుకుని కూతురి దగ్గరికి వెళ్ళాడు. కుమారి ముందురాత్రి తెల్లని సిల్కుచీర కట్టుకునుంది. కాని నాయుడు తలుపులు తెరిచేసరికి నల్లని సిల్కు చీరతో వికటంగా నవ్వుతూ "నాయుడోరి ఇంటికాడ . . నల్ల తుమ్మచెట్టునీడ ... ఎర్ర ఎర్రని పూవోడ. హాయ్!..." అంటూ పాడుతోంది.

హంటర్‌తో చితక బాదేసి, మొర్రోమని ఏడ్చాడు నాయుడు. కుమారి ఒళ్ళు నెత్తుర్లు చిమ్మి సొమ్మసిల్లి పోయింది. నాయుడు దెయ్యాలున్నాయని లెంపలు వేసుకుని మరీ ఒప్పుకున్నాడు. మంత్రాల 'మహంతి'ని పిలిపించి మూడు వేల నిమ్మకాయలు, ఆరువందల కొబ్బరి కాయలూ, మూడు అవు వాళ్ళాలూ వెయ్యి రూపాయలూ వదిలించుకున్నాడు.

అంచాత నాయుడికి దెయ్యాల నమ్మకంలేదూ అనడానికి వీలులేదు అన్నది రుజువైంది—

శివుడు భీముడు చెప్పిన ఈ కథను కాదనలేదు.

నాయుడు మరణం ఆ కథ జరిగిన పదిహేను సంవత్సరాలకి జరిగింది— దెయ్యాలున్నాయి అని ఒప్పుకున్న అతని మీద చేతబడి ఎందుకు జరిగిందో శివుడు చెప్పాల్సి ఉంది! నాయుడుగారి కూతురు సినీమాల్లో ఉందిట? బహుశా ఇప్పుడా అమ్మాయిని దెయ్యాలు పడుతున్నాయో లేదో? తెలియదు. రామం మాంబళంకేసి వెళ్ళడం మానేశాడు. సూరమ్మ దెయ్యం కూడా పోయిందట? అయినా వాడికి నమ్మకం లేదు అంటాడు.

చీకటిగా ఉంది. ఫ్యూజు పోయింది కాబోలు— మరి లైట్లు రాలేదు. భీముడు సిగరెట్లే ఎర్రగా వెలుగుతున్నాయి!

ఒక బొద్దెంక కాబోలు శివుడి మీద పాకింది. వాడింక కథ చెప్పనన్నాడుకాని భీముడువదల్లేదు. 'రమ్యలత' మేనమామ గనుక నాయుడు చావు తనకి అత్యంత అవసరమైందన్నాడు. శివుడు చెప్పాడు.

నాయుడుగారు మేనకోడళ్ళకి పెళ్ళిళ్ళు చేద్దామనుకుంటూ కర్నూలు వెళ్ళి కాపురం పెట్టాడు. అక్కడ ఒక నాడు పెద్దది 'సుమిత్ర' ఒక కారు డ్రైవర్‌తో మాట్లాడుతూ కనిపించిందట. నాయుడు బలిష్ఠుడు. కోపిష్ఠి. సుమిత్రని ఏమీ అన లేదు. ఆ డ్రైవర్ని పట్టుకుని చావ చితక్కొట్టాడుట!

డ్రైవర్ సుమిత్ర తనను ప్రేమిస్తోందనీ— ఇద్దరూ మద్రాస్ పోయి టాక్సీ కొనుక్కుని కాలక్షేపం చేస్తామనీ మరీమరీ చెప్పాడు. నాయుడు ఆ కుర్రాణ్ణి మళ్ళీ చితక్కొట్టి మద్రాస్ పంపించేస్తానని సుమిత్రను ఇంట్లో గదిలో పెట్టి తాళం వేశాడట!

అటు తర్వాత ఆరు నెలల్లో ఒక రోజు ఉదయం తొమ్మిది గంటల వేళ నాయుడుగారు మెట్ల మీద నుంచి జారిపడ్డాడు. అంతే మంచం పట్టాడు. నాయుడుగారి విధవప్ప చెల్లెలు మూడు నెలలు తిరక్కుండానే డాక్టర్లను మానిపించేసింది— మంత్రగాళ్లను పెట్టింది. వాళ్ళు ఒకడు నెల్లిమర్ల నుంచి




"నిజమే! ఈ చొక్కా, చీరా రెండూ మావే! కాని, అసలు నీకు వేసినప్పుడు...చొక్కా ఎర్రది కాదు! తెల్లది! చీర తెల్లది కాదు— నీలంది!! అది సంగతి!"

...ఒకడు ఆదిలాబాద్ నుంచి వచ్చారట. హోమాలు చేశారు. 'బ్రహ్మ రాక్షసన్నారు' ముగ్గులు వేశారు. ఇంట్లో దోమలు మూడు తరాలదాకా వచ్చేలా ధూపాలు బాడిదా చల్లేరు. గుమ్మాలకి మేకులు కొట్టారు ! అమ్మాయిలు ముగ్గురికీ రక్షరేకులు కట్టారు. నాయుడుగారి మంచంట్టూ మేకులు కొట్టారు. ఇనప్పెట్టెలో తాళాలు వేయకుండా

# అన్నీ దెయ్యాలకబుర్లే..

వదిలేసే వేంకటు—ఇక దాని అవసరం లేదనుకునేటంతవరకూ ఖాళీ చేశారు.

నాయుడుగారు మరి మూణ్ణెళ్ళకి మామూలుగా తిరుగుతారని, ఇదివరలో కిట్టనివాళ్ళు పూరికి పడమొరగా వెళ్ళి చేసిన ప్రయోగమని చెప్పారు మంత్రగాళ్ళు.

కిట్టనివాళ్ళు అంటే సబ్ ఇన్స్పెక్టరీ సర్కిల్ ఇన్స్పెక్టరీలాంటి పోలీసు నౌకరీలు చేశాడు కదా ఎవరేనా ఉంటారన్నారు అందరూ.

సుమిత్ర మంత్రగాళ్ళని కల్పుకుందిట. బహుశా తన వల్లనే మామయ్యకి ఈ అనుకోని ప్రయోగం జరిగిందేమోనన్న అనుమానం ఆ పిల్లది—మావయ్యకి నయమైతే తన చంద్రహారం రెండు పేటలది ఇచ్చేస్తానని చెప్పిందట కూడా.

అందులో ఒక మంత్రగాడు రాత్రి రెండో జాములో సుమిత్రను తనతో ఒంటరిగా రమ్మని పూరికి ఉత్తరంగా శ్మశానంలో నాయుడు మీద ప్రయోగం చేసిన వాళ్ళు ఒక మైనం బొమ్మను పాతేసి ఉంచారని— దాన్ని తీసి హోమం చేసి నీళ్ళల్లో కలిపేయాలనీ చెప్పాడట.

సుమిత్రకి భయం వేసింది. వెళ్ళలేదట. కాని సుమిత్ర తల్లి మాత్రం ధైర్యంగా మంత్రగాడితో వెళ్ళి అర్ధరాత్రి పూరవతల శ్మశానంలో నక్కలు కూసే వేళ— ఒక చోట జపం చేయించింది. అక్కడ గుండం త్రవ్వి, ఆ మంత్రగాడు ఒక మైనపు బొమ్మ తీశాడు. ఆరంగుళాలుంటుంది అది ! దానికి మోకాళ్ళల్లో గుండు సూదులు గ్రుచ్చి ఉన్నాయి "చూశారా అమ్మగారూ ! దీనికి ఏడు సూదులు గుచ్చారు— అంటే ఏణ్ణెళ్ళల్లో కాళ్ళు పడిపోయి మనిషి శుష్కించి ప్రాణాలు వదిలేస్తాడని అర్థం అన్నారు.

మర్నాడు నాయుడుగారి పెరట్లో మరుగుడు వేశాడు వాడు. అంటే మరో బొమ్మను చేసి పాతి పెట్టాడు. ఇది ఆ ప్రయోగం చేసిన వాడి చేతులు పడిపోవడానికి కన్నాడు.

నాయుడుగారి ఇల్లు ఆ వీధిలో వారందరికీ పిచ్చాపాటీ అయింది. కొందరటు వెళ్ళకూడదన్నంత భయపడ్డారు కాని కొందరు ధైర్యం చేసి వెళ్ళారు.

మంత్రగాళ్ళను పట్టుకున్నారు.

నాయుడు ఒళ్ళు గుల్ల అయింది. బ్రతుకుతాడా, లేదా?, అని నిలదీశారట.

"నాయుడు గనుక చస్తే మిమ్మల్ని ఈ పూళ్ళోనే పాతేస్తా" మన్నారు. ఆ పేట వదలకుండా ఆ ఇద్దరి మంత్రగాళ్ళ మీద నిఘా వేశారు.

కాని నాయుడు ప్రాణం పోయిందో ప్రాతః కాలాన పోయింది. మంత్రగాళ్ళ గుండెలాగిపోయాయి! మళ్ళీ అమిత వేగంతో కొట్టుకోసాగాయి.

జనం తమ ప్రేగులు తీస్తారేమోనని భయపడ్డారు వాళ్ళు. నాయుడు మీద పడి ఏడుస్తున్న ఆడకూతుళ్ళ మొదటా బోసిగా ఉన్నాయి.

"నాయుడు. చావలేదన్నారు" మంత్రగాళ్ళు. డాక్టర్లు మాత్రం అలా సర్టిఫికేట్ ఇచ్చారు.

మంత్రగాళ్ళు పెరట్లో బొమ్మని త్రవ్వి తీసికొని శ్మశానానికి వెళ్ళారు. అక్కడ హోమం చేసి మంత్రాలతో ఆ బొమ్మని పాతేస్తే ఇక్కడ నాయుడు లేస్తాడని చెప్పారు.

శవాన్ని మర్నాటిదాకా తియ్యొద్దన్నారు. ఆఖరి దఫాగా మరో ఏభై గుంజుకున్నారుట. మంత్రగాళ్ళిద్దరితో మరో ధైర్యమున్న నలుగురు రౌడీ సజ్జు ఉత్సాహంగా ఉన్న శ్మశానానికి వెళ్ళారు.

మర్నాడు ప్రొద్దున్నే [illegible] వెంగురూ మాత్రం తిరిగి వచ్చారు. మంత్రగాళ్ళు మాయమై పోయారన్నారు.

నాయుడు శవం ఇక ఉండకూడదన్నారు పుర పాలక శాఖాధికారులు! అది చివికిపోబోతున్నది. లాభం లేదు.

ఆ విధంగా నాయుడు ఇహలోక యాత్ర పూర్తయింది.

శివుడు కథ పూర్తి చేసే సరికి రామం భయంతో నన్ను కౌగిలించుకుని నిద్రపోతున్నాడు.

భీముడు గుప్పు గుప్పున సిగరెట్లు కాలుస్తున్నాడు. వాన వెలియలేదు. నా మీద ఆకలి తన ప్రతాపం చూపిస్తున్నది.

శివుడు "నాకు దెయ్యాల నమ్మకం లేదు" అంటూ గొణుకుతూ, కొవ్వొత్తి ఉంటే వెలిగించుదూ అంటున్నాడు— వాన కురిసి కురిసి అలిసిపోయింది.



# వనితాలోకం వ్యాసం

27 వ పేజీ తరువాయి

## కమ్యూనిటీ డెవలప్‌మెంట్

మహిళాసంస్థలు ముఖ్యంగా "సోషల్ వెల్‌ఫేర్ మినిస్ట్రీ" ప్రజలందరూ ప్రభుత్వ కార్యకలాపాలలో పాల్గొనేటట్లు కృషి సల్పుతున్నవి. ముఖ్యంగా ఆరోగ్య వ్యవహారాలలో శ్రద్ధ చూపటం కమ్యూనిటీ డెవలప్‌మెంట్ వారి కర్తవ్యంగా పరిగణించబడుతున్నది.

## సైనిక శిక్షణ

ప్రపంచంలోని ఏ దేశంలోనూ లేని ప్రత్యేకత ఇజ్రాయిల్ దేశానికి ఉంది. అదేమిటంటే మహిళలకు కూడా పురుషులతో పాటు మిలిటరీ శిక్షణ గరపటం! నిర్బంధ సైనిక శిక్షణవల్ల స్త్రీలకు పిరాచూట్లు, సబ్‌మెరీన్లు నడపగల సమర్థత కూడా అప్పుడే వచ్చేసింది. ఆ దేశపు సాంఘిక రాజకీయ జీవితంలో స్త్రీలదే ప్రముఖమైన పాత్ర అన్నా అతిశయోక్తి కానేరదు. 18 సంవత్సరాల ప్రాయం రాగానే స్త్రీలకు కూడా నిర్బంధ సైనిక శిక్షణ ఉంటుంది. వారివారి అభిరుచులనుబట్టి నౌకాదళంలోగానీ, ఏర్‌ఫోర్సులోగానీ, పదాతిదళంలో గానీ శిక్షణ పొందవచ్చు. అలా 20 సంవత్సరాల వచ్చే వరకూ అంటే 2 సంవత్సరాలపాటు ప్రతి మహిళా శిక్షణ పొందక తప్పదు. కాని, ప్రస్తుతం కొన్ని క్రొత్త ఆలోచనలు లేకపోలేదు. సిగ్నలింగు, సి. ఐ. డి. బిజినెస్ వంటివి స్త్రీలు చేస్తూ, యుద్ధరంగంలో పోరాడటమనేది పూర్తిగా పురుషులకు వదిలివేస్తే బాగుంటుందని చాలామంది అభిప్రాయం.

చాలామంది బాలికలు "నహల్" అనే వ్యవసాయక, సైనిక సంస్థలో చేరతారు. అచ్చట శిక్షణ పూర్తికాగానే "కిబుట్జ్" అనబడే చిన్న వ్యవసాయిక క్షేత్రాలువారు నెలకొల్పవచ్చు. శిక్షితులు మూడు శాఖలుగా విభజింపబడతారు. మొదటి శాఖ కేవలం మిలటరీకి సంబంధించినదిగా ఉంటుంది. మిగతా రెండు శాఖలు విద్య, వ్యవసాయం మొదలైన విషయాలపై కేంద్రీకరిస్తవి. కాని, తమాషా ఏమిటంటే ఈ రెండు సంవత్సరాల ట్రైనింగు కాలంలోనే చాలామంది తమ జీవిత భాగస్వాములను ఎన్నిక చేసుకుంటారు. కొందరు 'నహల్'లో శిక్షణ అయిన

[illegible] కూడా కద్దు!

## రాజకీయవేత్తలు

ఇజ్రాయిల్‌కు 120 మంది గల "నెస్సెట్" అనే పార్లమెంటు ఉంది. ఇందులో 12 మంది స్త్రీలు. వీరిలో "గోల్డామీర్" అనే ఆమె ఒక మంత్రిణి. ఈమె చాలా సంవత్సరాలుగా విదేశాంగ శాఖను నిర్వహిస్తున్నది. చుట్టూ ఉన్న అరబ్ దేశాల శత్రుత్వాన్ని జ్ఞాపకం పెట్టుకుంటే ఆమె ఉద్యోగం ఎంత కష్టమైనదో అర్థమవుతుంది. ఒకవైపు పురుషులకు ఉండవలసిన గట్టితనం ఉండాలి. మరొకవైపు అతి సున్నితమైన 'స్త్రీత్వము' ఉండాలి. ఈ రెంటినీ సమన్వయపరచి ఆమె తన విధ్యుక్త ధర్మాన్ని నిర్వహిస్తున్నది. అందుకే ఆ దేశంలో ఒక "జోక్" బహుళ ప్రచారంలో ఉంది. "మంత్రి మండలిలో ఉన్న ఒక్క ఒకే పురుషుడు గోల్డామీర్" అని.

"యహూది సిమోని' అనే ఆమె ఇజ్రాయిల్ లోని 'పొలిటికల్ డిపార్టుమెంటు'కు "హెడ్". 'రీనా లెవిన్‌సన్' అనే ఆమె ఆ దేశపు ఏర్‌ఫోర్సులో ప్రముఖురాలు. 'స్టెల్లాలేవి' అనే ఆమె సైన్యంలో ఉన్న 6 గురు స్త్రీ కల్నల్స్'లో ప్రథమురాలు. వీరేకాక ఇంకా అనేకులు పురుషులు చేయవలసిన భారీ పనులను నిర్వహిస్తున్నారు. 'పీరావిజ్'మన్ అనే ఆమె ఒక మాజీ ప్రెసిడెంటు భార్య, రెడ్‌క్రాస్ సంస్థకు అధ్యక్షురాలు. మరొక ప్రెసిడెంటు భార్య రాచెల్ బెన్‌జీవ్. ఈమె దేశానికంతటికీ పెద్దదైన ఒక వ్యవసాయక సంస్థకు అధ్యక్షురాలు. వీరేకాక వ్యతిరేక పక్షంలోకూడా స్త్రీలు ఉన్నారు. 'రాజియల్‌నూర్' అనే ఆమె ఇజ్రాయిల్ ప్రభుత్వం వ్యతిరేకుల చేతుల్లోకి పోవటమే జరిగితే విద్యామంత్రి అయితీరుతుంది. అమెరికాలోని రాయబారి భార్య అయిన 'జీనాహార్మన్' బోర్డు కార్యనిర్వాహకురాలు కూడా!

## సైనిక శిక్షణవల్ల ప్రేమ

"స్త్రీల సైన్యం" అనేది ఉన్నది నేటి ప్రపంచంలో ఒక్క ఇజ్రాయిల్ దేశంలోనే! ఒకరోజు కల్నల్ 'స్టెల్లాలేవి' మిలిటరీ శాల్యూట్ తీసుకోవటం ఒక ప్రముఖ వ్యక్తి చూశాడు. ప్రపంచ విఖ్యాతమయిన "సబ్ మెషిన్ గన్‌లు" భుజాలమీద పెట్టుకుని 'బ్లూకాప్స్'తో, బారులుతీరి స్త్రీలు నడిచిపోతుంటే చూడ ముచ్చటగా ఉన్నదిట! ఈ 'పెరేడ్' అయిన తరువాత, ఒక అందమైన అమ్మాయిని ఆ వ్యక్తి ఇంటర్వ్యూ చేయడం జరిగింది. ఆమె ఒక ఆఫీసర్‌ట! ఎవరోకాదు. పారిస్‌లో ఇజ్రాయిల్ దేశపు రాయబారి కుమార్తె! "ఇజ్రాయిల్ సైన్యంలో ఆఫీసరుగా ఉండటం ఎలా ఉంటుంది" అని మొదటి ప్రశ్న! జంకూ, గొంకూ లేకుండా ఆమె "వండర్‌ఫుల్" అని జవాబిచ్చింది. "మిలటరీ జీవితం మిగతా ఏ పనులు చేయడానికి అడ్డురాదు. ఉదాహరణకు నా విషయమే తీసుకోండి, నేను సైన్యంలో ఉంటూనే డిగ్రీ కోర్సుకు చదువుతున్నాను" అంటుంది. వెంటనే ఆ వ్యక్తి "మరి ఇక మాటో. పెళ్ళి అవసరంలేదా ?" అన్నాడు. "దానికేం! పెళ్ళికూడా చేసుకోవచ్చు!" అన్నది కొంచెం సిగ్గుపడుతూ!

"అయితే పెళ్ళిచేసుకోవచ్చునేమో కాని గృహ జీవితం, మిలటరీ జీవితం ఒకేసారి సాధ్యమా ?" అన్నాడు.

"ఓ! ఏం? వీలులేదా" అంది ఆశ్చర్యంగా, ఇంగ్లండులో చదువుకున్న ఆ యువతి, 'నా మేజర్‌ను చూపిస్తాను రండి" అంటూ ముందుకు నడిచింది. 'రుహోమా' అనే ఆమెకు ఆ వ్యక్తిని పరిచయం చేసింది. రుహోమా మిలటరీ దుస్తులలో ఉంది. అంతేకాదు! ఆమె స్పష్టంగా గర్భిణికూడా!!

ఈ సంభాషణతో ఆ వ్యక్తికి కలిగిన సందేహాలన్నీ తీరే ఉండాలిమరి!





'ఇదిగో, నిన్నే! ఆ కాలండర్ చూసి వచ్చేవారంలో పండుగలు ఏమన్నా వున్నాయేమో చూడు! ఉంటే, యీ వారఫలాలలో 'మృష్టాన్న భోజనం' అని రాయాలి!...

# హృదయ కుసుమాలు

15వ పేజీ తరువాయి

కని వెళ్ళొద్దన్నారు. గండం గడిచిందనుకున్నాం. నా సంతోషానికి హద్దులు లేవు. ఈ శుభవార్త రమాదేవికి చెప్పాలనిపించింది.

అరగంట గడిచింది. నర్సు అక్కయ్య గదిలో నుంచి ఆదుర్దాగా పరుగున వెళ్ళి లేడీ డాక్టరును పిల్చుకొచ్చింది. లేడీడాక్టరు వచ్చింది. అయిదు నిమిషాల్లో బయటి కొచ్చింది. బావనూ, నన్నూ, అమ్మనూ రమ్మన్నది. వెళ్ళాం. మాకు పై ప్రాణాలు పైనే పోయినయ్యి. అక్కయ్య పిచ్చి చూపులు చూస్తున్నది. గుడ్లు తిరిగిపోతున్నయ్యి. కళ్ళు వాలి పోతున్నయ్యి. నోరు మూతపడి బిగుసుకు పోయింది. కాళ్ళూ చేతులూ చల్లబడ్డయ్యి. మందులూ, ఇంజక్షన్లూ, ఆక్సిజన్ అన్నీ ఇచ్చారు. బిత్తరి చూపు లతో మా అందరి వైపూ చూసింది. ఎంతో ప్రయా సతో నోరు పెగుల్చుకొని బావతో ఈ నాలుగు మాటలూ చెప్పింది.

"ఇంక నేను అందర్నీ విడిచి పోతున్నాను. బాబుని చూసుకోండి. ఒక్క మాట చెపుతారా" అన్నది బావ చెయ్యి తన చేతుల్లోకి తీసుకుని.

"ఏమిటది జానకీ" అన్నారు బావ.

"నామీద మీకున్న అనుమానాలన్నీ తీరినయ్యా నేను, నేను... నేనేమీ పతితురాల్ని కాదు" అన్నది బొంగురు పోయిన కంఠంతో. ఈ మాటలకు మా అందరి కళ్ళు చెమ్మగిల్లినయ్యి. బావకు పట్ట లేని దుఃఖం పెల్లుబికి వచ్చింది.

"క్షమించు జానకీ! నేను మూర్ఖుడ్ని. నువ్వు దేవతవు. నిన్ను అర్థం చేసుకోలేక పోయాను. అర్థం చేసుకున్న సమయంలో, నా తప్పు నేను తెల్సుకున్న తరువాత నువ్వు ఈ తీరుగా. . . ."

ఇంక మాట్లాడలేక పోయారు బావ. అక్కయ్య చేతులతో తన ముఖాన్ని కప్పుకుని చిన్న పిల్లాడిలా బావురుమని వెక్కివెక్కి ఏడ్చారు. లేడీ డాక్టరూ, నర్సులూ బావను లేవదీశారు. నేను లోపల్లోపలే కుమిలిపోతూ అక్కడే నిల్చున్నాను.

బావ కళ్ళు తుడిచింది అక్కయ్య.

"విచారించకండి. నేను ఏ అపవాదులూ నెత్తిన వేసుకోకుండానే ముత్తైదువగానే వెళ్ళిపోతున్నాను. అదృష్టవంతురాల్ని. ఇంకో మాట. మీకూ, సీతకూ. . . ఇష్టమైతే. . ." ఇంక మాట్లాడలేక పోయింది.

కళ్ళు మూతలు పడినయ్యి. క్షణంలో అంతా చూస్తుండగానే శాశ్వతంగా కన్ను మూసింది అక్కయ్య. అమ్మ బావురుమని శవం మీద పడి ఏడ్చింది. నా పరిస్థితి చెప్పలేను. బావ ఆ క్షణం లోనే పిచ్చివాడిలా అయిపోయారు. కళ్ళంట నీళ్ళు కారుతున్నయ్యి. ఏం మాట్లాడకుండా అక్కయ్య ముఖంలోకి చూస్తూ నిల్చున్నారు. ఎంతో బరువుగా నిట్టూర్చి అక్కయ్యకు నమస్క రించి తలొంచుకుని మెల్లిగా ఆ గదిలోంచి బయటి కొచ్చేశారు.

శవం పైన దుప్పటి కప్పి నర్సులు మమ్మల్ని బయటికి పొమ్మన్నారు."

ఇంతవరకూ చెప్పి సీత కంట తడిపెట్టింది.

*　　*　　*

సీత మళ్ళీ చెప్పసాగింది. రాధ కూడా కళ్ళు తుడ్చుకుని ఎంతో ఆసక్తితో వినసాగింది—

"కర్మకాండలన్నీ యథావిధిగా జరిగినయ్యి. వచ్చిన బంధువులంతా వెళ్ళిపోయారు. అమ్మ కడుపు దుఃఖంతో నగమైంది. బావస్థబ్దులై పోయారు. ఎప్పుడూ కళ్ళలో కన్నీళ్ళు తిరుగు తూనే ఉండేవి. ఎవ్వరితోనూ మాట్లాడరు. నేనూ, సుభద్రా గుండె రాయి చేసుకోక తప్పలేదు.

నెల్లాళ్ళవరకే ఇంక ఉండలేక అమ్మా, నాన్నా, నేనూ ఏలూరు వెళ్ళిపోదామనుకున్నాం.

తల్లి గండాన పుట్టాడో ఏమో పిల్లాడు కులాసాగానే ఉన్నాడు. తల్లి కనీసం కళ్ళారా ఆ పసి కందుని చూసుకునే యోగ్యత కూడా లేకపోయింది. వాడెంత పాపకర్మం చేసుకున్నాడో ? అక్కయ్య బ్రతికుంటే వాడి ముంచి చెడ్డలు ఎంతో ఆనం దంగా, సంతోషంగా చూసుకుంటూ వేళకు నీళ్ళుపోసి, పాలుబట్టి, ఉగ్గు పెట్టి, పొడరురాచి, బొట్టు పెట్టి వాడి ముద్దు ముచ్చటలు చూసి ఆనందించేది. ఆ అదృష్టం వాడికి లేదు. ఎవరికి వీలైతే వాళ్ళు ఆ పసివాడికి నీళ్ళు పోస్తున్నారు. ఎవరికి వీలయితే వాళ్ళు పాలు పడుతున్నారు. వీడ్ని చూసి అంతా విచారపడుతున్నారే కాని, సంతోషపట్టంలేదు.

బావ కళ్ళల్లో కన్నీరు ఇంకి పోయింది. పశ్చా త్తాపంతో ఆయన మనస్సు దహించుకు పోతున్న ట్లుగా అర్థం చేసుకున్నాను. కాపురానికి వచ్చిన సంవత్సరం లోపల జానకి విషయంలో తను చూపిన నిరాదరణా, మొదట్లో పడ్డ అనుమానాలూ అన్నీ తల్చుకుని కుమిలి పోయేవారు. ఎప్పుడూ ఉయ్యాల వద్ద నిల్చుని ఆ పసివాడ్ని చూస్తూ కళ్ళు తుడ్చుకునేవారు.

ఈ పెద్దతనంలో కోడలు కర్మ కాండలు జరు పుతూ నేను బ్రతక వలసి వచ్చిందని అక్కయ్య మామగారు అందరితో చెప్పి బాధ పడేవారు.

వెళ్ళే రోజున అమ్మ మరీ కన్నీరు మున్నీరుగా ఏడ్చింది. ఆ పరిస్థితి చూస్తే అమ్మ కూడా ఈ దిగులుతోనే ఏమయినా అవుతుందా అనిపిం చింది. పసివాడ్ని జాగ్రత్తగా చూసుకోమని ఆవిడతో చెప్పలేక, చెప్పలేక చెప్పింది. సుభద్ర నన్ను కౌలించుకుని ఒకటే ఏడుపు.

"సీతా ! వదినె పోయిందని, ఈ ఇంటితో మీకేం సంబంధం లేదని రాకపోకలు మానెయ్యకు. మీ అక్కయ్య ఉన్నప్పుడు ఎట్లా ఉండేదానివో, ఇప్పుడూ అట్లాగే ఉండాలి. బాంధవ్యం తెంచు కోకు" అంటూ ఏడ్చింది.

నా పరిస్థితి ఇంక చెప్పనక్కర్లేదు. ప్రయాణ మవుతుంటే అక్కయ్య ఇంకా ఇంట్లోనే తిరుగు తున్నట్లూ, తన సంసార జీవితంలోని కబుర్లు నాకు చెపుతున్నట్లూ, అంత పెద్ద పొట్టతో నడవలేక మెల్లిగా నడుస్తున్నట్లూ, రమాదేవితో మాట్లాడు తున్నట్లూ స్పష్టంగా కనుపించింది. కళ్ళు మూసినా, కళ్ళు తెరిచినా అక్కయ్య కనుపించేది. మానవ జీవితాల్లో ఎంత మార్పు ? ఎన్ని విచిత్ర సంఘటనలు ? ఎన్ని చావులు ?

వెళ్ళలేక వెళ్ళలేక అంతా కన్నీళ్ళతో బండి ఎక్కాము. గంపెడు చీకటి నెత్తినవేసుకొని, పుట్టెడు దిగులుతో, విచారంతో, ఆవేదనతో రైలెక్కాము.

*　　*　　*

చచ్చిన్నాటి దుఃఖం మర్నాడు ఉండదు. మర్నాటి దుఃఖం మూడో నాడు ఉండదు. అని అంటారు పెద్దవాళ్ళు. వారి భావంలో దుఃఖమంటే పైకి వ్యక్త పరిచే కన్నీళ్ళే కావచ్చు. పలకరించటానికి వచ్చిన వాళ్ళని చూసి పొంగి పొర్లుకొచ్చే విచారంతో బావురుమని ఏడవటమే కావచ్చు. అలాంటి దుఃఖం పిల్లల విషయంలో తల్లిదండ్రులు వ్యక్త పరిచేది. తల్లిదండ్రులు పోయినప్పుడు పిల్లలు వ్యక్త పరి చేది. అల్లుడు పోయినప్పుడు కూతుర్ని చూసి వ్యక్త పరిచేది. భార్య పోయినప్పుడు భర్త, భర్త పోయిన ప్పుడు భార్య వ్యక్త పరిచేది. ఈ అయిదు రకాల చావులూ మనిషిని కృంగ దీసేవి. ఈ రకమైన దుఃఖాన్ని వ్యక్త పరిచేది ముఖ్యంగా అమ్మపంతు, తరు వాత నాన్నవంతు, బావవంతు, అక్కయ్య చావు నా విష యంలో వీరందరినీ మించి పోయింది. కన్నీరు కాలు

## కలికాలం!

కాలచక్రం తిరుగుతోంది
ధర్మచక్రం విరుగుతోంది
మాయాంధకారము పులుముకొన్నది
ఈ చతురంబోధి పరీత జగతిని
మానవాళి దానవాళిగా మారింది
కృతజ్ఞతా భావం నశించింది
పుణ్యాత్ములే పుడమికి కరువయ్యారు
ధర్మదేవతాక్రందన అరణ్య రోదనేనా ?
—అరాచక పిశాచ నృత్య విన్యాసము ప్రయుక్తమేనా ?
మహాపురుషులు గాంచిన బంగారు కలలు
ఈ ప్రపంచములో శిథిలాకృతి చెందిన కల్లలేనా ? .....
కాలచక్రం తిరుగుతోంది
ధర్మచక్రం విరుగుతోంది !

—డి. ఉదయభాస్కరరావు

వేలని కట్టేట్టున్నగా పెద్దవాళ్ళు పెద్దినట్టుగా కాపురమని ఏడవలేను. పలకరించటానికి వచ్చిన వాళ్ళను చూసి అమ్మ మాదిరి రాగాలు పెట్టలేను. నా జీవితం అటువంటిది. వయస్సుకీ, జీవితానికీ సంబంధం ఉన్నది. బాంధవ్యానికీ, వయస్సుకీ సంబంధం ఉంది. మానసిక సంక్షోభానికీ, బాంధవ్యానికీ సంబంధం ఉంది. నా మనస్సులో, హృదయంలో, ఆలోచనలలో, నిత్య జీవితంలో అనుక్షణమూ అక్కయ్య సంగతులే ఆక్రమించినయ్యి. ఇంట్లో తిరుగుతూ చూసినా, భోజనం ముందు కూర్చునా, ఆకాశం వైపు చూసినా సర్వత్రా అక్కయ్య రూపమే కనబడుతుంది. అంత తన తప్పు కప్పిళ్ళు రావు. అక్కయ్య ఆలోచనలు తప్ప మరే ఆలోచనా లేదు. బావను తల్చుకుంటే సానుభూతి కలుగుతుంది. ఏం మాట్లాడాలో, ఎట్లా పలకరించాలో తెలీదు. రమాదేవిని తల్చుకుంటే ఏదో తెలీని ఈర్ష్య కలుగుతున్నది. ఎందుకో తెలీదు. అందరి జీవితాలనీ ముడిపెట్టి, అందరి మనస్సులూ అర్థం చేసుకుని, ఎవరికి ఎట్లా నచ్చ చెప్పాలో నచ్చచెప్పి, అందరి ఆదరాభిమానాలనూ పొందుతూ, కొత్త కాపురం కుదుట పడే సమయంలో అందర్నీ వదిలి శాశ్వతంగా తనే వెళ్ళి పోయింది. తల్చుకుంటే కడుపు చెరువై పోతుంది. నిత్య జీవితమే శూన్యంగా తోస్తుంది. నిరాశ, తీరని ఆవేదన. బావమీదా, రమాదేవి మీదా ఏమిటో, ఎందుకో తెలీని కోపం.

అందరికీ పరీక్షలయి శలవు లిచ్చారు. అక్కయ్య పోయి రెండు నెల్లయింది. మళ్ళీ కాలేజీలూ, స్కూళ్ళూ తెరిచే రోజులు దగ్గర కొచ్చినయ్యి. గుంటూరు నుంచి వచ్చాక బావ రెండు ఉత్తరాలు నాన్నగారి పేర రాశారు. పిల్లవాడు కులాసాగానే ఉన్నట్టు. వాళ్ళ నాన్నగారు వినుకొండ నుంచి మళ్ళీ గుంటూరు మార్చించుకున్నార్ట. మళ్ళీ యథాప్రకారం అంతా కలిసి ఉంటున్నార్ట.

ఒక రోజున నా పేర కవరొచ్చింది. ఆత్రంగా కవరు విప్పి ఉత్తరం చూశాను. రమాదేవి రాసిన ఉత్తరం. రమాదేవి మీద కోపం కలిగి క్షణంలోనే మాయమైంది.

గుంటూరు.

సీతా,

నా ఉత్తరం చూసి నువ్వు కోపగించుకుంటావని తెల్సు. కారణం విడమర్చి చెప్పక్కర్లేదు. కొంత మంది వ్యక్తులకి సంఘంలో ప్రత్యేక స్థానం ఉంటుంది. మనస్సు, హృదయమూ ఉండి, ఎంత సహృదయతతో సద్భావాలనే పెంపొందించుకొన్నా సాంఘిక న్యాయ సూత్రాలకు కట్టుబడి దూరంగా ఉంటూనే చూస్తుండ వలసిందే. లేకపోతే ఇంకా విపరీతపరిస్థితులనుఎదుర్కో వలసివస్తుంది. మీఅక్కయ్య పోయినప్పుడు ఆసుపత్రికి మాత్రమే వచ్చి మిమ్మల్ని చూడ గలిగాను. మళ్ళా ఇంటికొచ్చి నీతో మాట్లాడి నా మానసిక వ్యథని నీతో చెప్పుకోటానికి సాహసించ లేక పోయాను. కారణం అందరికీ భయపడే. మీ ఇంటికి రాగానే జరిగిన విషయాలు ఎట్లా ఉన్నా ఆ అమ్మాయితోనే మా అల్లుడు ఉంటున్నది అని మీ అమ్మగారనుకోవచ్చు. మా అబ్బాయి కాపురం చెడగొట్టింది ఈ అమ్మాయేనని మీ అక్కయ్య అత్తగారూ అనుకోవచ్చు. అప్పుడు నా మనస్సు, పరిస్థితి ఎట్లా ఉంటుందో నువ్వే ఆలోచించు. మీ బావగారితో నేను చనువుగా ఉంటూనూ, వాళ్ళింటికి వెళ్ళటమూ నా నోటని ఈ రాత రాసినయ్యి. అనుమానాలు అనుకోకుండానే కలుగుతయ్యి. మానవ సహజమే అది. బజార్లో రోడ్డు మీద చెల్లెలితో మాట్లాడినా అసందర్భంగా చిత్రించుకుని నవ్వుకునే రోజులే ఇవి. అందుకే నేను మళ్ళా రాలేదు. క్షమించమని వేడుకుంటున్నాను. శలవుల్లో ఏమీ తోచటం లేదు. మనస్సూ సరిగ్గా లేదు.

ఇటీవల ఒకసారి సుభద్ర కనిపించింది. స్కూలు ఫైనలు ప్యాసయింది. కాలేజీలు తెరిచాక పి. యు. సిలో చేరుతుందిట. నేనూ బి. కాం ఫైనల్ ఇయర్‌లో చేర్తాను. నీ చదువు సంగతి ఏమిటి. మానేసినట్లేనా. నువ్వూ ఏలూరులో కాలేజీలో చేర్తే మంచిదేమో.

జీవితంలో కాలప్రవాహానికి ఎదురీదట మనేది వాంఛనీయం కాదేమో. జీవిత సమస్యల్ని పరిష్కరించుకోలేక, నిత్యమూ అనేక సంఘర్షణలకు గురవుతూ కాలం వెళ్ళబుచ్చట మనేది ఆడదాని జన్మహక్కుగా నాకు అనిపిస్తున్నది.

మీ అక్కయ్య బ్రతికున్నన్నాళ్ళు ఆవిడ జీవితం ఈ రకంగానే గడిచి పోయింది. మళ్ళీ మన కలయిక ఎప్పుడో ? వెంటనే జాబు వ్రాస్తావుగా !

నీ స్నేహితురాలు.

రమాదేవి

ఉత్తరం చదివాక రమాదేవి మీద నాకు ఎందుకో తేలిక భావం కలిగింది. కారణం నాకే తెలియదు. తప్పులు చెయ్యటం, ఆ తప్పులు దిద్దుకోవటం, ఆ తప్పుల వల్ల బాధ పడటం మానవ సహజమే. కాని రమాదేవి విషయంలో అనాహ్వానమైన సంగతులను తల్చుకుని ఎందుకో బాధ పడతాను. బాధ పడ్డాను.

రమాదేవి ఉత్తరానికి సమాధానం రాశాను.

కాలేజీలు తెరిచారు. పూరికే కూర్చుంటే అనేక ఆలోచనలు. అనేక విచారాలు. అనేక రకాలయిన భావాలు. అర్థంలేనివి కొన్ని, అర్థం ఉన్నవి కొన్ని. అర్థం చేసుకుందా మనుకున్నా అర్థం కానివి కొన్ని.

నాన్నతో చెప్పాను కాలేజీలో చేర్తానని. ఆయనేమీ మాట్లాడలేదు. తండ్రికి ఆర్థిక చిక్కులు. ఆ ఆర్థిక చిక్కులు అనేక రకాలు. అమ్మని అడిగాను. ఆవిడ మనస్సు అక్కయ్య చావుతో అగాధమై పోయింది. ఆవిడ మనస్సులో ఏముందో స్పష్టంగా చెప్పలేదు. ''చూద్దాంలేవే'' అన్నది. ఆ చూద్దామన్న మాటకు అంతర్య మేమిటో అప్పుడు నాకు తెలీలేదు.

రెండు రోజులు గడిచినయ్యి. నాన్న నన్ను పిల్చారు. కాలేజిలో చేర్పించటానికి ఒప్పుకున్నారు కాబోలనుకున్నాను.

''సీతా''

''ఏం నాన్నా''

''చదువుకోవాలనే ఉందా''

''అందుకనేగా నాన్నా కాలేజీలో చేర్తానంది''

''అసలు నీ ఉద్దేశ్యమేమిటో. నీ భవిష్యత్తు ఎట్లా నిర్ణయించుకున్నావో చెప్పు తల్లీ'' అన్నారు కన్నీరు పెట్టుకుని

''భవిష్యత్తు విషయం నేను ఆలోచించలేదు నాన్నా. కాలేజీ చదువు పూర్తయ్యాకనే భవిష్యత్తు సంగతి ఆలోచించటమనేది.'' అన్నాను.

''బి. య్యే. పూర్తి కావాలంటావా''

''నేనే మగపిల్లవాడి నయితే చదివించవా నాన్నా''

నాన్న మనస్సులోనే నవ్వుకుని ''నిజమేనమ్మా'' అన్నారు.

''మీ ఉద్దేశ్య మేమిటి నాన్నా''

''ఏం లేదమ్మా. అట్లాగే కాలేజీలో చేరి చదువుకో'' కళ్ళు తుడుచుకున్నారు.

అమ్మ దగ్గరకి వెళ్ళాను.

''నాన్న ఒప్పుకున్నారమ్మా చదువు చెప్పించటానికి. ఎల్లుండి కాలేజీలో చేర్తాను'' అన్నాను అమ్మతో.

అమ్మ, ''నీ ఇష్టం'' అంది.

(సశేషం)



''ఆగవయ్యా! దేవుడా! నువ్వు పరీక్ష ప్యాసవుతావని చెప్పాను కాన్నీ, ఈసంవత్సరం అని చెప్పలేదుగా! బాగా గుర్తు తెచ్చుకో!''

పెళ్ళివారి దగ్గర నుంచి ఉత్తరం చదువుతూ "ఈసారి కూడా మనం భయపడ్డట్లే జరిగింది" అన్నారు మోహనరావు గారు, భార్యతో, వాడిపోయిన మొహంతో. "వాళ్లకు చిన్నమ్మాయి నిస్తే చేసుకుంటారట. పెద్దమ్మాయికి ఇంకో సంబంధం చూసుకోమన్నారు."

ఈ విషయం తను అంతకుముందే వూహించడం వల్ల శశిరేఖ, "ఏం చేస్తాం ? దాని విషయం తరువాత చూసుకోవచ్చు. ముందు, చిన్నదానికి ఈ సంబంధం స్థిరపర్చుకుందాం" అంది.

"అంతేనంటావ్ ? ఒకవేళ వాళ్లు వెంటనే పెళ్లి చేసెయ్యమంటే, పెద్దదాన్ని అలా ఉంచి చిన్నదానికి పెళ్లి చేస్తావా ?"

అప్పటికే భర్తకు కోపం తెప్పించానని గ్రహించిన శశిరేఖ, అంతకన్నా పైమెట్టుకు వెళ్లడం ఇష్టంలేక "ఏమో, మీ ఇష్టం !" అంటూ వంటింట్లోకి జారుకుంది. ప్రక్కగదిలో వీళ్ల మాటలు ఆతృతగా వింటున్న, గిరిజా, వనజలు ఒకరినొకరు సాభిప్రాయంగా చూసుకున్నారు. వారిద్దరూ మోహనరావుగారి కుమార్తెలు. ఇరవైఏళ్ల గిరిజ చామనచాయగా, సామాన్యంగా ఉంటుంది. వనజకు పద్దెనిమిదేళ్లు. మంచి ఛాయా, పెద్ద కళ్లూ, కొంచెం బొద్దుగా ఉన్న విగ్రహం, చూసేవారికి వెంటనే ఆకర్షిస్తుంది. వీరిద్దరికీ వివాహాలు చెయ్యాలని, తండ్రైన మోహనరావుగారు చాలా సంబంధాలు వెతుకుతున్నారు. కాని, పెళ్లిచూపులకు వచ్చిన పెళ్లికొడుకులంతా గిరిజను వద్దనీ, చిన్నమ్మాయి వనజను చేసుకుంటామనీ అంటున్నారు. ఈవిధంగా మూడు సంబంధాలు తప్పిపోయి చివరకు నాలుగో సంబంధం తీసుకువచ్చారు. గిరిజకు. పిల్లవాడు నల్లగా ఉంటాడు. మంచి ఆస్తిపరులు, పైగా పాతికేళ్ల ఆ యువకుడు రైల్వేలో నెలకు నాలుగు వందలు సంపాదిస్తున్నాడు. వనజను దమ్మిడీ కట్నంలేకుండా చేసుకుంటానన్నాడు.

మోహనరావుగారు విశాఖపట్నంలో ఒక కంపెనీలో చిన్న ఉద్యోగి. వేరే ఆస్తిపాస్తి లేదు. ఆయన వయసు నలభై అయిదేళ్లుంటాయి. ఇద్దరే కూతుళ్లు. వచ్చే జీతం, సంసారానికే చాలడం కష్టమవడంవల్ల ఏమీ మిగలదు. అందువల్ల కూతుళ్లకు పెళ్లి చెయ్యడం ఆయన కొక పెద్ద సమస్య అయింది. అయినా ఇద్దరు కూతుళ్లూ పెళ్లి కెదిగి ఉండడం వల్ల ఎలాగో అప్పయినాచేసి పెళ్లిళ్లు చెయ్యాలని నిశ్చయించారు.

తనను ప్రతి పెళ్లికొడుకూ నిర్లక్ష్యంచేసి, వనజను ఎంతో ఆశక్తిగా చూడడం గిరిజకు ఎంతో బాధ కల్గించేది. కాని అది పైకి వ్యక్తం చేసేదికాదు. తనలోనే లోపముంది. తను అందవిహీనురాలు. తన తల్లి కడుపున పుట్టిన బిడ్డలైనా, భగవంతుడు ఇద్దరిలోనూ ఎంతో తేడా పెట్టాడు. అయినా తను మాత్రం ఒక స్త్రీ కాదా ? వచ్చినవారికి నచ్చకపోతే, నచ్చలేదనకుండా, చిన్నమ్మాయిని చేసుకుంటామనడం, తన నవమానపరచాలనే కదూ ? అందంగా లేనంతమాత్రాన అంత చులకనగా తీసెయ్యాలా ? స్త్రీకి అందం ఒకటే అవసరమా ? తక్కిన విషయాలలో తను వనజకన్నా ఎన్నోరెట్లు తెలివైనది. అయినా అవెవరికీ అక్కర్లేదు—అని బాధపడేది గిరిజ. కాని, ఆమె బాధను గ్రహించిన తలితండ్రులు కూడా తమ నిస్సహాయతను వ్యక్తపరిచారు.

పెళ్లికొడుకు వనజను కట్నంలేకుండాపెళ్లి చేసుకుంటాననటం వల్ల మోహనరావుగారు ఆ సంబంధాన్ని వదులుకోలేక చిన్నమ్మాయి పెళ్ళే ముందు చెయ్యడానికి నిశ్చయించారు. ఆయన అనుకొన్నట్లు, పెళ్లి తొందరగా చెయ్యమని కూడా వాళ్లు పట్టుబట్టారు. తనకు కావలసిన వివాహం చెల్లెలికి జరిగిపోతూంటే, గిరిజ మనస్సులో ఒక విచిత్రమైన అశాంతి బయల్దేరింది.

వయసులో, మనసులో ఉప్పొంగే కోరికల్ని తను అనుభవించే అవకాశం తననుంచి లాక్కొన్నట్లుగా చెల్లెలు అనుభవిస్తూంటే చూసి ఓర్వలేకపోయింది గిరిజ. చెల్లెలు దాంపత్య జీవితం సుఖమయం కాకూడదనిపించింది—ఆమె అంతరాళాల్లో ఎంత అణుచుకున్నా ! దానికి తగ్గట్టు పెళ్లికొడుకు వయసులో కొంచెం పెద్దవాడు కావడం, నల్లగా ఉండడం, పెళ్లి సమయంలో చాలా బెట్టుగా ప్రవర్తించడం, కొంత ఆమెకు శాంతి నిచ్చాయి. తన మనసులోని భావాలు చెల్లెలు పసిగట్టకుండా, కప్పిపుచ్చుకొని, చెల్లెలితో ఉల్లాసంగా మాట్లాడింది.

పెళ్లి జరిగింది. శోభనం కూడా జరిగిపోయింది. శోభనం జరిగిన మరునాటి ప్రొద్దున్న చెల్లెలు ఆనందంలో తేలిపోతూంటుందనీ, మరిది ఉత్సాహంతో ఉరకలు వేస్తాడనీ వూహించుకున్నగిరిజకు, వారిద్దరూ ముభావంగా ఉండటం ఆశ్చర్య కారణమైంది. దాంపత్యపు ప్రథమ ఘట్టం అంత రసవంతంగా జరుగలేదని గిరిజ గ్రహించింది.

తను ఒకసారి ఎవరో చెప్తూంటే విన్న మాటలు జ్ఞాపకమొచ్చాయి గిరిజకు. దూరదేశంలో ఒంటరిగా ఉద్యోగంచేసే యువకులు, చిన్నతనంలో వివాహం చేసుకోక విచ్చలవిడిగా తిరిగి, ఎవతెనో మరిగి, తరువాత వివాహం చేసుకున్న భార్యను నానా హింసలూ పెడ్తారని ఎవరో అన్నారు. చెల్లెలి భర్త కూడా అలాంటివాడు కాదని నిశ్చయ మేముంది ? ఒకవేళ




"అయ్యా! చూడండి! మిమ్మల్నే! ఈ థర్డ్‌క్లాసు పెట్టెలలో... డబ్బులుచ్చుకొని... సీట్లు యిచ్చే కుర్రాళ్లు ఎక్కడ వుంటారో కాస్త చెబుదురూ? ..."

# మనసులోని తెర

పోయి, చెల్లెలివైపు చూసింది. వనజ, "పెళ్ళికొడుకు నీకు నచ్చాడని చెప్పనా?" అంది నవ్వుతూ. "ఛీ! పోర్మయ్ !" అంది గిరిజ కృతక ఆగ్రహంతో.

శశిరేఖ వచ్చి, త్వరలోనే పెళ్ళి ముహూర్తం పెట్టిస్తాననీ, భర్తకు వెంటనే రమ్మని టెలిగ్రామిప్పించాననీ చెప్పాక గిరిజ మనసు పొంగిపోయింది. "అల్లు డెంత మంచివాడే. పాపం గిరిజకోసం, మనం చెప్పకపోయినా, 'మంచి సంబంధం తెచ్చిపెట్టాడు" అని శశిరేఖ అల్లుణ్ణి పొగుడుతూంటే వనజ తనలో తను నవ్వుకుంది.

ఆ రాత్రి భర్తకు తాంబూలం అందించటానికై పడక గదిలోకి వెళ్ళిన వనజతో సూర్యారావు "రాణి గారి వ్రతం పూర్తయినట్లేనా ?" అని అనడం, ఏదో పనుండి అటువెళ్ళిన గిరిజ, కిటికీకి ప్రక్కగా నిలుచుని ఆ మాటలు వినడం జరిగింది.

"ఇంకా పెళ్ళి కావాలిగా !" అంది వనజ చిలిపిగా.

"నా బాధ్యత తీరిపోయింది. ఇక తక్కినది మీరు చూసుకోవలసిందే" అన్నాడు సూర్యారావు.

"అవును. పాపం మీరెంతో మంచివారు కాబట్టి నా మాట విన్నారు. మనిద్దరం సరదాగా ఉంటే మా అక్క మనసు నొచ్చుకుంటుందేమోనని నేను పెట్టిన షరతులకు ఒప్పుకున్నారు. ఇహ మిమ్మల్ని బాధించను" అని వనజ భర్తతో అంటుంటే గిరిజ తెల్లబోయింది.

ఆ రాత్రల్లా గిరిజ మనసులో వనజ చర్యే మెదలసాగింది. తను ఇన్నాళ్ళనుంచీ, ఆ భార్యాభర్తల ముభావ ప్రవర్తనకు ఎన్ని దుష్ట కారణాలు వూహించుకుందో, చివరికి అదంతా చెల్లెలికి తనమీదగల అభిమానం అని గ్రహించాక గిరిజకి ఒక్కసారి పశ్చాత్తాపం ఆవరించింది. ప్రక్కమీద ఒక గంటసేపు ఏడ్చేసింది. ఆ దుఃఖంతో తననెంతో తిట్టుకుంది. చెల్లెలి భర్త గురించి ఆమె మనసులోని అపోహ తెర తొలగిపోయి మనసు స్వచ్ఛమైన నిర్మలమైన నిద్రపట్టింది. ★

# బూట్ పాలిష్
## రాము కథ

8 వ పేజీ తరువాయి

రాము చొక్కా విప్పి చూపాడు. ఇంకా ఆగాయం పచ్చి పచ్చిగానే ఉంది.

రాము చెపుతుంటే నిజంగా ఆశ్చర్యం వేసింది! పైగా బూట్‌పాలిష్ చేయించుకొనే వాళ్ళంతా బూట్లనుమొహం మీది కల్లా తెచ్చిపెడతారట. పాపం ఆ కుర్రాడు కూడా మనలాంటి మానవుడే కదా! ఏదో పటాటోపం కోసం బూట్లను తీసుకెళ్ళి, అతని మొహానికి దగ్గరగా పెట్టి, నడివీధిలో గొప్పతనం కోసం ప్రాకులాడటం కన్నా, బూట్లను విప్పి అతనికిచ్చి, గౌరవంగా ఒక ప్రక్కన నిలబడి పాలిష్ చేయించుకోవటంలోనే నిజమైన సంస్కారం ఉందేమోనని అనిపిస్తుంది.

* * *

దేశాన్ని తల క్రిందులు చేస్తున్న ఆహార పరిస్థితి ఈ అబ్బాయి మీద ఎలా ప్రతిఫలించిందో, తెలిసికోవాలన్న కుతూహలం కొద్దీ "బాబూ, బియ్యం దొరుకుతున్నాయా" అని అడిగేసరికి సమాధానంగా రాము ఒక చిన్న సంఘటన చెప్పాడు. దాదాపు పదిరోజుల క్రితం అతని తండ్రి బియ్యం కోసం కోపరేటివ్ స్టోర్ దగ్గర క్యూలో నిలబడ్డాడట. నిలబడీ, నిలబడి కాళ్ళు నెప్పులు పుట్టాయట. ఇక నిలవలేక, శోష వచ్చి పడిపోతే, చుట్టు ప్రక్కల వాళ్ళు జాలిపడి, రిక్షాలో ఇంటికి తెచ్చారట. రాము దృష్టిలో ఆహార సమస్య దాల్చిన రూపం అదే.

* * *

'రాము' కథ విన్న తరువాత; దాదాపు ఏడెనిమిది గంటలు అతనితో ఉండి ఆ కన్నీటి గాథను కళ్ళారా చూచిన తరువాత— మనం పదిహేడేళ్ళ స్వతంత్ర జీవనంలో సాధించిన ప్రగతికి సంబంధించిన సందేహాలెన్నో ఈ విలేఖరికి రావటంలో ఆశ్చర్య మేమున్నది !

ఫోటోలు : ప్రభాకర్. ★

# న్యూఢిల్లీ లేఖ

12 వ పేజీ తరువాయి

పోవటం, ప్రభుత్వంవారి మరీ పెద్ద తప్పు!

## అవినీతి నిర్మూలనం

మరో కొత్తవార్త. దేశంలో ఉండే వ్యాపార సంస్థలన్నీ, ఒక్కొక్క ప్రతినిధిని ఏర్పాటుచేసుకోవాలని ప్రభుత్వం ప్రకటన చేయబోతుంది. వీళ్ళకు ప్రభుత్వం అంగీకారపత్రాలను అధికారయుతంగా ఇస్తుంది. మంత్రులతో సంప్రదించాలన్నా, అధికారులను కలిసి మాట్లాడాలన్నా, ఆయా కంపెనీల తరఫున యీ ప్రతినిధులు మాత్రమే వెళ్ళాలి. లంచగొండితనం తగ్గాలంటే, ఇలాంటి చర్య తప్పకుండా దోహదమిస్తుంది.

కాని, మరో సందేహం. పెద్ద పెద్ద వ్యాపారులను గురించి చర్చించి, ముచ్చటించేందుకు పార్లమెంటు సభ్యులు, ఇతర రాజకీయవాదులు మంత్రులను కలియటాన్ని ఎందుకు నిషేధించకూడదు. ?

చిన్న ప్రశ్న : ఈ మంత్రులంతా తరచుగా పర్యటనలకు వెళుతుంటారు. తమ పర్యటనల్లో పారిశ్రామికవేత్తల ఇళ్ళల్లోను, పెద్ద పెద్ద వ్యాపారుల ఇళ్ళల్లోను ఈ మంత్రిపుంగవులు ఉండటం కూడా ఎందుకు నిషేధింపబడకూడదు ?

## మంత్రులపై నిషేధం

ఇక— కొందరు మంత్రులున్నారు. తమ మంత్రిత్వ విభాగంతో సంబంధంలేని ప్రభుత్వ కార్యదర్శులను, ఇతర అధికారులను కలియటం వీరి తప్పుకాదా ? దీనినికూడా నిషేధించి, మంత్రులను తమతమ పరిహద్దుల్లోనే ఉంచవలసిన అగత్యాన్ని ప్రభుత్వం ఎంతవరకు గుర్తించింది ?

'లంచగొండితనం' వూరూరా, వాడవాడనా అల్లుకపోవటానికి ఇలాంటివెన్నో సవాలక్ష కారణాలున్నాయి.

అవినీతి నిర్మూలనం పత్రికా ప్రచారాల మూలంగా జరగదు. కావలసింది నిర్దుష్టమైన చర్య. కాంగ్రెసువాదులను చూచిన కంటితోనే, ఇతరులను చూడనంత కాలం ఈ ప్రభుత్వంమీద ప్రజలకు సద్భావం ఏర్పడటానికి అవకాశంలేదు. 'అవినీతి' పోవాలంటూ చేసే శుష్కదండగ నినాదాలే ఒక రకంగా దేశంలో 'అవినీతి'ని రెచ్చగొట్టి, పెంపొందింపచేస్తున్నాయా అనిపిస్తున్నది.

## ప్రణాళికా సౌభాగ్యం !

ఇక ప్రణాళికల మాటేమిటి ?

ఇటీవలనే ఆర్థికశాఖ, ప్రణాళికా సంఘాల మధ్య జరిగిన ఆట, 'డ్రా' తోనే ముగిసింది !

నాలుగవ ప్రణాళిక అంచనాలను రు. 22,700 కోట్ల మేరకు రూపొందిస్తూ, కైరోలో ఉన్న ప్రధానికి ప్రణాళికాశాఖవారు పంపారు. ఈ నివేదికలో నాలుగవ ప్రణాళికకు సంబంధించిన అంశాలను కూడా స్థూలంగా ప్రస్తావించటం జరిగింది.

ప్రస్తుతపు యోచన ప్రకారం వచ్చే ప్రణాళికలో రెండు రకాల కార్యక్రమాలుంటాయి. మొదటిది "విధిగా" అమలుజరగవలసిన కార్యక్రమాలు. డబ్బూ, ఇతర ముడివస్తువులు లభ్యమయి, అన్నీ సానుకూలిస్తే అమలుజరిగేవి రెండవరకపు పథకాలు.

మొదటి తరగతికి చెందిన పథకాలన్నీ వెనువెంటనే అమలుజరగాలని అధికారుల యోచన. మందకొడితనం ఆవేశించిన మూడో ప్రణాళిక మళ్ళీ కాకుండా, ఎలాంటి ఆలస్యం లేకుండా జరగవలసిన పథకాలివి.

## ప్రధాన ఆశయాలు

అధికోత్పత్తులను సాధించటం, ధరల స్థిరీకరణ అనే రెండు అంశాలు నాలుగో ప్రణాళిక ప్రధాన ఆశయాలు. వ్యవసాయోత్పత్తులు పెరిగే విధంగానే ప్రణాళికను రూపొందించటం జరుగుతోంది. 'వ్యవసాయోత్పత్తులు కనీసం ఐదు శాతమైనా పెరగనిదే, ధరలు తగ్గటం అసంభవం' అని ఒక వర్గం వాదన. పైగా అన్ని రంగాలలో ఉత్పత్తులు పెరగనిదే మళ్ళీ 'పన్నుల హెచ్చింపు' కు చోటు ఉండదు. ఇప్పుడు విధింపబడిన పన్నులకే ప్రజలు సతమత మయిపోతున్నారు..

మరో ప్రమాదం కూడా ఉంది— ఉదాహరణకు సిమెంటు, ఉక్కులాంటి వస్తువుల ఉత్పత్తి పెరగని పక్షంలో, ప్రస్తుతం నిర్మించవలసియున్న ప్రాజెక్టులన్నీ ఐదో ప్రణాళికకు వాయిదాపడవచ్చును.

అందువల్ల మొత్తంమీద నాలుగో ప్రణాళిక నిండా బోలెడన్ని అంశాలుంటాయి. ప్రణాళికలనే ఉపాసిస్తున్న పెద్దలందరికీ నిరివిగా ఆహారమూ దొరుకుతుంది. ఇవన్నీ అమలు జరగటం మాత్రం— వచ్చే ఆదాయాలనుబట్టే ఉంది. ఆదాయాలు రావటం అధికోత్పత్తుల సమస్యనే అంటిపెట్టుకొని ఉంటుంది.

## ప్రణాళికల నిజస్వరూపం

ప్రణాళికల స్వరూపం కూడా ఒక్కోమారు

పూర్తిగా పోరిపోతున్నదా అనిపిస్తున్నది. వాటి విలువలు కూడా రంగులను మార్చుకొంటున్నాయి. ఈ ప్రణాళిక ఒకప్పుడైనారు, కాంగ్రెసువారికి "ఎన్నికల తంత్రం" గా బాగా పనికొస్తున్నది. ఇండియన్ ఛేంబర్ ఆఫ్ కామర్స్ ధర్మమా అంటూ — ఈ ప్రణాళిక కొందరికి మంచి మంచి ఉద్యోగాలనే ప్రదానం చేస్తున్నది—అధికోత్పత్తుల మాట ఎలా ఉన్నా ? పాపం, మౌలానా ఆజాద్ కూడా ఒకప్పుడు చెప్పారు: ప్రణాళికయొక్క గొప్పతనం గవర్నమెంటువారు చెప్పించే ధనాన్నిబట్టి ఉంటుంది కాని, అది ఫలితాలనుబట్టి కాదని అన్నారు! నిజమేనా అది ?

వ్యవసాయరంగం చాలావరకు స్తంభించిపోవటం, ఇతర రంగాలు ఉత్పత్తి చేసిన "కృత్రిమమైన డబ్బు" ఎక్కువ కావటం మొదలైన కారణాలవల్ల ధరలు పెరిగాయి. ముఖ్యంగా గత రెండు సంవత్సరాలనుంచీ ధరలు, ఒక్క క్షణం విశ్రాంతి అయినా పుచ్చుకోకుండా, పెరుగుతూనే ఉన్నాయి.

## మళ్లీ పన్నుల హెచ్చింపు?

ఇంతవరకు ప్రణాళికలకు అవసరమైన ఆదాయాలను గురించిన అంచనాలు పూర్తిగా వెలువడలేదు. ప్లానింగ్ కమిషన్ కథనం ప్రకారం, 1965—66 లో వచ్చే ఆదాయం తమకు తెలియనందువల్ల, సరైన అంచనా వెయ్యలేకపోయామంటారు. అంటే 1965—66 లో మళ్లీ ప్రభుత్వం పన్నుల పెంచగలదనే అర్థం స్ఫురింపచేయటంలేదూ ! .... ఇదంతా చూస్తుంటే, 'మళ్లీ వచ్చే జనరల్ ఎన్నికలలో కాంగ్రెసువారికి ఏమాత్రం స్థానాలు లభిస్తాయో' అన్న విచారం పుట్టుకొస్తున్నది.

## శాస్త్రిగారి ప్రణాళిక

శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రికి ప్రణాళికలతో గల సంబంధం ఎటువంటిదో కూడా తెలుసుకోవచ్చునే. శాస్త్రి వ్యతిరేకకక్షులు 'నెహ్రూ ప్రణాళికనే' కొనసాగించమంటున్నారు. మనందరికీ తెలుసు—నెహ్రూగారి ప్రణాళికల్లో ఎక్కువగా భారీ పరిశ్రమలే కనిపిస్తాయని. దానివల్ల ఈనాటి ఆర్థిక అస్తవ్యస్త స్థితి కూడా వచ్చిందన్న సంగతి నిజమేగా ! శాస్త్రి వ్యతిరేకకక్షులు తెచ్చే ప్రోద్బలం మూలంగా దేశానికి లాభంలేకపోయినా, ఆయా వ్యక్తులైనా బాగుపడగలరు.

## ఎన్నెన్నో సంఘాలు

ప్రణాళికల అమలు జరిగేటందుకూ వివిధ రంగాలలో జరిగే అభివృద్ధిని సమీక్షించేందుకూ ప్రణాళికా సంఘం ఒక ప్రత్యేక సంఘాన్ని నియమిస్తున్నది. రాష్ట్రాల స్థాయిన కూడా ప్రణాళికలు ఎలా ఉన్నాయో తెలిసికొనేందుకు ముఖ్యమంత్రులతో ప్రణాళికాధిపత్యంలో కూడా మరో సంఘం ఏర్పాటవుతుంది. అధికోత్పత్తులకు సంబంధించిన ముఖ్యమైన సమస్యలను పర్యాలోచించేందుకు అఖిలభారత ప్రణాళికాసంఘం ఉపాధ్యక్షులతో మరో ప్రత్యేక సంఘం కూడా ఏర్పాటవుతుంది.

ప్రణాళికలు గడిచిపోతున్నాయి. సంఘాలమీద సంఘాలు ఏర్పాటవుతున్నాయి. సరి అభివృద్ధి !

—శ్రీ కృష్ణ ★

# రంగావలోకనం

క్రిందటి వారం ప్రఖ్యాత హిందీ చలన చిత్ర దర్శకుడు, నిర్మాత, నటుడు అయిన గురుదత్ మరణ వార్త విన్నవారి నందరినీ క్రుంగదీసింది. నలభై యేళ్ల నడివయసులో ఇంతటి కళాకారుణ్ణి కోల్పోవటం భారత దేశంలోని చలన చిత్ర పరిశ్రమకు తీరని లోటు. చిత్రకళకు విధి కళాఘాతమది. గురుదత్‌కి భార్య నేపథ్య గాయని గీతాదత్, తరుణ్, అరుణ్ అని ఇద్దరు కుమారులు ఒక కుమార్తె కలరు.

గురుదత్ మొదటి చిత్రం, దర్శకునిగా అతి విజయవంతమైన "బాజీ." ఇందులో ప్రత్యేకత బాల్‌రాజ్ సాహ్ని స్క్రీన్‌ప్లే, అప్పటి మంచి కొత్త పంథా త్రొక్కిన సచిన్‌దేవ్ బర్మన్ సంగీతం. అంతకు ముందు సినిమారంగ మెరుగని వి. కె. మూర్తి నవ్యరీతి ఛాయాచిత్రగ్రహణం. ప్రత్యేకంగా పాటల సన్నివేశాలలో ఇది నవకేతన్ చిత్రం. దీనితో బాటే హిందీ చిత్రాలలో "క్రైమ్" కథలకు గిరాకీ హెచ్చింది. ఆ చిత్రం తరువాత ఆ మూసలో సుమారు వంద చిత్రాలు వచ్చి ఉంటాయి. అందులో ఒక పది కూడా ఆ అంతస్తుకు రాలేకపోయినవి.

ఆ తరువాత గురుదత్ దర్శకత్వం వహించిన చిత్రం ఫిల్మార్ట్స్ వారి "జాల్". ఇందులో కూడా పై సాంకేతిక, తారా బలాలే ఉపయోగింపబడ్డవి. గీతాబాలి, దేవానంద్, సచిన్‌దేవ్ బర్మన్, వి. కె. మూర్తి, సాహిర్ లూధియాన్వి, గీతాదత్. వాస్తవానికి "బాజీ" కంటే ఈ చిత్రమే దగ్గరగా ఉన్నా విజయానికి అంత దగ్గరగా రాలేకపోయినది. ఈ చిత్రంలోని విశేషం 'గోఆ' క్రైస్తవుల జీవితం యదార్థంగా చిత్రించ బడటం.

గురుదత్ మొట్టమొదట నటించిన చిత్రం "బాజ్" ఇది పోర్చుగీస్ వారి ప్రథమ ఆక్రమణ కాలంలో మహారాష్ట్ర తీర వాసులకు వారికీ జరిగిన నౌకా యుద్ధాలకు ఇందులో ప్రాముఖ్యత నిచ్చారు. ఓ. పి. నయ్యర్ రెండవ చిత్రమిది. వెనువెంటనే గురుదత్ స్వంత సంస్థను స్థాపించి నిర్మించిన "ఆర్ పార్"తో ఆ సంగీత దర్శకుని పేరు తారామండలానికి ఎగ ప్రాకింది. ఈ చిత్రంలో నాయిక శ్యామా. గురుదత్ టాక్సీ డ్రయివరు. ఇది క్రైమ్ చిత్రం. విజయానికి తోడ్పడ్డవి సంగీతం, ఛాయా గ్రహణాలు.

తరువాత స్వంత సంస్థ కోసం "మిస్టర్ అండ్ మిసెస్ 55" "ప్యాసా", "కాగజ్ కే ఫూల్", "సి. ఐ. డి", "చౌదవీ కా చాంద్" "సాహిబ్ బీబీ ఔర్ గులామ్" చిత్రాలు నిర్మించారు. వీటిల్లో మధుబాల, వహీదా రహమాన్, షకీలా, మీనాకుమారి నాయికలు. మొదటి చిత్రంలో అధునాతన యువతులు చేసే చేష్టలను కమ్మగా వెక్కిరించారు. "సి. ఐ. డి."తో తిరిగి క్రైమ్‌ని, సంగీతాన్ని విజయవంతంగా మేళవించారు. "ప్యాసా"తో ఇంతకు ముందెప్పుడూ ఎవరు సాహసించని పద్ధతిని వేశ్యలను వారి జీవితాలను ఒక కవి జీవితంలో కలిపి చూపించారు. "చౌదవీ కా చాంద్"తో లక్నో ప్రాంత మహమ్మదీయుల ఆచార వ్యవహారాలను అనుసరించి ఒక చక్కని ప్రేమ గాథను తయారు చేసి తెరకెక్కించారు. "కాగజ్ కా ఫూల్" భారత దేశంలో తయారయిన ప్రథమ సినిమాస్కోప్ చిత్రమే కాకుండా సినీజీవుల జీవితాన్ని వ్యంగ్యంగా చిత్రించినది. "సాహబ్ బీబీ"తో బెంగాలీ రచన విశాల

56 వ పేజీ చూడండి



రాజ్యం ప్రొడక్షన్స్‌వారి 'శకుంతల' చిత్రం రికార్డింగు ముహూర్తం భరణీ స్టూడియోలో జరిగిన సందర్భంలో తీసిన ఫోటో.



'మంచిమనిషి' లో జమున.





శ్రీ ఎన్. టి. రామారావు అధ్యక్షతన [సమీక్ష గతవారం వేశాము] ఆంధ్రపత్రిక అభ్యుదయ కళామండలి ప్రదర్శించిన 'తోబుట్టువులు'లో ప్రసంగిస్తున్న శ్రీమతి అంజలీదేవి.(చేతులు కట్టుకుని నించున్నది)

# సినిమా వార్తలు

## హార్పోమార్క్స్ మరణం

చాప్లిన్, హార్డీ, లారెల్, కాంటర్, లాయిడ్, కీటన్ మొదలయిన పేర్లతో బాటు మార్క్స్ పేరుకూడా చలనచిత్ర చరిత్రలో చిరస్మరణీయంగా ఉండిపోతుంది. గ్రూచో, చికో, హార్పో మార్క్స్‌ల సినిమాలు చూసిన వారికి అవి మరపురాని స్మృతులుగా మిగిలిపోతాయి. ఒక్కమాట పలక్కుండా కేవలం సజ్ఞలతో ప్రేక్షకులని కడుపు పగిలేట్లు నవ్వించటమే కాకుండా వారిలో అవర్ణనీయమైన విషాదానుభూతిని కలిగించే శక్తి హార్పోకే ఉండేది. పెద్ద నటుడే కాదు హార్పో మంచి 'హార్పు' వాద్యగాడు కూడా. పేరు దాన్ని బట్టే వచ్చి ఉండాలి! నిజంగా స్వర్గమనేది ఉంటే, అక్కడ ఏంజల్స్ హార్పులు వాయిస్తే వారిలో హార్పోమార్క్స్ తప్పకుండా ఉంటాడు.

## భారత్-తూర్పు జర్మనీల ఉమ్మడి చిత్రం

'అలెక్జాండర్ ఎండ్ చాణక్య' అనే చిత్రాన్ని తూర్పు జర్మనీ వారూ బొంబాయి 'ఫిలిం ప్రొడ్యూసర్స్ కో ఆపరేటివ్' వారూ కలిసి నిర్మిస్తున్నట్లు వార్త. ఇందులో పోలిష్ నటి బియాటాటిస్జ్‌కీవిచ్ సెల్యూకస్ కూతురు హెలెన్ పాత్ర ధరిస్తుందిట. హెలెన్‌ని చంద్రగుప్త మౌర్యుడు భార్యగా స్వీకరించటం చరిత్రలోని విషయమే. మౌర్య చక్రవర్తి పాత్ర ప్రదీప్‌కుమార్ ధరిస్తాడు.

## బెంగుళూరులో స్టూడియో?

కర్ణాటక ఫిలింస్ లిమిటెడ్ అనే సంస్థ బెంగుళూరులో స్టూడియో నిర్మాణ సఫలాన్ని పరిశీలిస్తున్నది. ఈ సంస్థ ఇప్పటికి 20 సంవత్సరాలకి పైగా చిత్ర నిర్మాణ వ్యాపారంలో ఉంది. త్వరలో స్టూడియో నిర్మాణం విషయమై ఒక నిర్ణయానికి రాగలదు.

## జగపతివారి కొత్త చిత్రం

జగపతి పిక్చర్స్ వారు నిర్మించనున్న నాలుగవ చిత్రం "అంతస్తులు" షూటింగు కార్యక్రమం అక్టోబరు ఆఖరువారంలో హైదరాబాదు సారథీ స్టూడియోలో ఆరంభమవుతుంది.

సాంఘిక కథ యీ చిత్రం ఇతివృత్తం. ఇందులో ప్రముఖులు అక్కినేని నాగేశ్వరరావు, పి. భానుమతి, కె. జగ్గయ్య, కృష్ణకుమారి, గుమ్మడి, జి. వరలక్ష్మి, రేలంగి, రమణారెడ్డి గారలు నటిస్తారు.

దర్శకత్వం: వి. మధుసూదనరావు, సంభాషణలు, ఆచార్య ఆత్రేయ, సంగీతం: కె. వి. మహాదేవన్, కెమెరా: పి. నాగేశ్వరరావు, పాటలు: ఆత్రేయ; కొసరాజు, ఆరుద్ర, నిర్మాత: రాజేంద్రప్రసాద్.

## మేఘ(సందేశం) దూత్

బొంబాయి నిర్మాత త్రిలోక్ జెట్లీ కాళిదాసు మహాకావ్యం 'మేఘదూత్' (లేక 'మేఘ సందేశం')ని త్రివర్ణ చిత్రంగా రూపొందించనున్నారని వినికిడి. రవిశంకర్‌ని సంగీత దర్శకునిగా ఎన్నుకొన్నారు

# "తోబుట్టువులు" నాటకం ప్రదర్శనలోని చిత్రాలు!



'తోబుట్టువులు' నాటకంలోని రెండు సన్నివేశాలు: (1) వసంతకుమార్, సి. డి. యస్. రామయ్య, జ్ఞానశేఖరం (2) దుర్గాదేవి, రాజేశ్వరి, కె. గోపాలరావు.





నాటకం చూస్తున్న టి. కృష్ణకుమారి, అంజలీదేవి, ఎన్. టి. రామారావు, పీరాజీ, శివలంక శంభుప్రసాద్ గారలు. పాసిరో ఆవిష్కృతి.



నాటకానంతరం "జనగణమన"కి ముందుగా తారలతో నాటకబృందం; మండలి నిర్వాహకులు కలిసి తీయించుకున్న చిత్రం.



అచ్చం, అక్కినేని నాగేశ్వరరావుగారిలా కనుపించే యీ నటుని పేరు డాక్టర్ హెచ్. వి. సుందర్. ఈయనను చూసి చాలామంది 'నాగేశ్వరరావు' అనే భ్రమపడతారట. గాంధీ జయంతి సందర్భంలో "పిల్గ్రిమ్స్ యూనివర్స్' వారు హైదరాబాదులో ప్రదర్శించిన 'మంచీ-చెడూ' నాటకంలో డాక్టర్ సుందర్ నటించారు.



'వివాహబంధం'లో భానుమతి

# వార్తలు

లేదుట. దాని సినాద 40 లక్షల రూపాయలు ఖర్చు చేస్తారుట.

## ఒకటే సెట్-ఒకే పాత్ర!

'ఇది మాత్రం ఆధారం చేసుకుని చిత్రం నిర్మిస్తే ?' 'చూసేవారుండ' రన్నారు కొందరు కాని సునీల్‌దత్ అంత పనీ చేశారు. 'యాదేంయిన్' అనే చిత్రాన్ని 45 రోజుల్లో పూర్తి చేశారు అందులోని తారాగణం మొత్తం సునీల్‌దత్ ఒకడే కథ షింకార్ సాహెబ్, స్క్రిప్టు అక్తార్— ఉల్—ఇమాన్, కెమేరా రామచంద్ర.

## సోవియట్ చిత్రనిర్మాణ పరిశోధన

రష్యాలో చిత్రనిర్మాణ పద్ధతులని పరిశీలించటానికని ఫిలింస్ డివిషన్ అధికారి శ్రీ మోహన్ వాధ్వాని రెండు వారాల పాటు ఆ దేశం పర్యటిస్తారు.

## ఆసిఫ్ దంపతులపైన దొంగల దౌర్జన్యం

దిలీప్‌కుమార్ సోదరి అఖ్తర్‌ని ఆసిఫ్ పెళ్ళి చేసుకున్న విషయం సినిమా అభిమానులకి తెలిసినదే; ఈ వివాహం దిలీప్‌కుమార్, ఆసిఫ్‌ల మధ్య విరోధాలకి ప్రైతం దారి తీసిందనే వార్తలు వెలువడ్డాయి. కాని ఇటీవల ఆసిఫ్ ఇంట్లో దొంగలు పడి అతనికీ, అతని భార్యకీ ప్రమాదకరమైన గాయాలు తగిలాయి. ఇది విచారకరమైన విషయమే కాని ఒక విధంగా మంచి చేసిందని కొందరంటున్నారు —దిలీప్‌కుమార్ ఆసిఫ్‌ల మధ్య విరోధాలు మాయమైపోయాయని వింటాము. ప్రస్తుతం 'మొగలె ఆజం' నిర్మాత బ్రీచ్‌కాండీ ఆస్పత్రిలో కోలుకుంటున్నారు.

## చిట్టిబాబుకి 'వైణిక సార్వభౌమ' బిరుదు ప్రదానం

మద్రాస్ పుర ప్రముఖులు పెద్దలు కలిసి వైణికుడు శ్రీ చిట్టిబాబు అభినందన సంఘంగా ఏర్పడి అక్టోబర్ 12న [illegible] సత్కరించారు. ఈ సన్మాన సభలో యువకుడూ సరస్వతీ కటాక్ష సమన్వితుడూ అయిన శ్రీ చిట్టిబాబుకి పుష్పగిరి పీఠాధిపతి శ్రీ శంకరాచార్యులు పండిత శాలువతో సత్కరించి "వైణిక సార్వభౌమ" అని బిరుదు ప్రదానం చేశారు. సభకు డా. రాజమన్నార్‌గారు అధ్యక్షత వహించారు. "పూర్వ జన్మ పరిపాకం" గల కళారాధకునిగా చిట్టిబాబుని ప్రశంసించారు. శ్రీయుతులు ఆరుద్ర, వి. ఏ. కె. రంగారావు మున్నగువారు ప్రసంగించారు. '[illegible]' అనే అపురూప చిత్రంలో శ్రీ చిట్టిబాబు వినిపించిన 'వీణ'ను అతనికి ఈ సందర్భంలో బహూకరించారు. ఈమని శంకర శాస్త్రిగారి శిష్యుడు 28 సంవత్సరాల యువకుడు అయిన చిట్టిబాబు సన్మాన సంఘంలో శ్రీయుతులు [illegible], బి. ఎన్. రెడ్డి, శ్రీధర్ మున్నగు పలువురు ప్రముఖులు పెద్దలుగా ఉన్నారు— తర్వాత చిట్టిబాబు 'వీణ' శ్రోతలకి వీనుల విందుగా వినిపించారు.

మధ్యమధ్య అభినయాలు [illegible] విండైన తత్వాన్ని కదిలించలేక పోయాం. కాని అతని 'వీణ' శ్రోతలను పులకింప జేసింది. ఈ సందర్భంలో వెలువరించిన సాంగ్ ముచ్చటగా వుంది.

## భద్రాచలంలో 'భక్తరామదాసు'

వి. యస్. ఫిలిమ్స్ వారి " భక్త రామదాసు " నిర్మాణం ముగింపు కావస్తున్నది. రామదాసు జైలు జీవిత దృశ్యాలు అన్నీ ఇటీవలనే పూర్తి చేశారు. " జైలు ఆవరణ " సెట్టులో ఈనెల 12 నుండి 15 వరకూ రమణారెడ్డి, లంక సత్యం, ప్రభావతి మొదలగు వారితో అనేక హాస్య సన్నివేశాల షూటింగు పూర్తి చేశారు.

దాదాపు వందమంది జూనియర్ ఆర్టిస్టులతో భద్రాచలం వెళ్ళారు. శ్రీ నాగయ్య, గుమ్మడి వంగర, అల్లు రామలింగయ్య, టి. ఎ. రాఘవరావు, తాపీషా శ్రీ పసల సూర్యచంద్రరావు ప్రభృతులు భద్రాచలంలో ఒక పది రోజులుండి చిత్రం చివరి ఘట్టాలన్నీ పూర్తి చేశారు.

దమ్మక్కకు విగ్రహాలు లభించటం, కబీర్కు దేవాలయ ప్రవేశానికి ఆటంకం, విగ్రహాలు మాయం కావటం, కబీరును జనం రాళ్ళతో కొట్టటం తదితర దృశ్యాలన్నీ చిత్రీకరిస్తున్నారు. మహమ్మద్ రఫీ పాడిన 7 పాటల్లో నాలుగు పాటలు భద్రాచలంలో కబీరు శ్రీ గుమ్మడితో చిత్రీకరణ చేస్తున్నారు. తుది ఘట్టంలో వున్న యీ చిత్రం వైకుంఠ ఏకాదశి ( డిశంబరు ) నాటికి విడుదల లౌతుందని తెలుస్తున్నది. దర్శకత్వం, సంగీతం : శ్రీ నాగయ్య. సంయుక్త దర్శకులు : శ్రీ పి. యస్. శ్రీనివాసరావు. నిర్వహణ : " మహేశ్వర్ ".

## విజయవాడలో 'శ్రీ' నాటక ప్రదర్శన

విజయవాడ శ్రీ రామమోహన గ్రంథాలయం హాలులో స్థానిక నటరాజ కళాసమితి ఆధ్వర్యాన కళార్ణవ థియేట్రికల్స్ వారు, శ్రీ ధారా రాధా కృష్ణమూర్తి రచించిన " శ్రీ " అనే చరిత్రాత్మిక నాటికను ప్రదర్శించారు.

చండాలిక బౌద్ధ జాతక కథ ఆధారంగా రచింప బడిన యీ నాటికలో ఆనందుడు, ఘోర వుడు పాత్రల ద్వారా నాడు బౌద్ధ మతానికీ, తాంత్రిక కాపాలిక మార్గాలకూ జరిగిన సంఘర్షణ చిత్రింపబడింది. మత సంఘర్షణ ఒక వైపూ, మంత్ర ప్రేరితుడై 'శ్రీ' కామార్తిగా కొని రాబడిన ఆనందునిలో అంతఃస్సంఘర్షణ మరో వైపూ ఈ నాటికలో ప్రముఖంగా ప్రస్తావించటం జరిగింది. శ్రీ అనుంచర్ల గోపాలరావు రంగాలంకరణ చేసిన దీనిలో శ్రీ వీలందరాజా శ్రీనివాసరావు, శ్రీ ధారా రాధా కృష్ణమూర్తి శ్రీ పి. వేణుగోపాల రావు, శ్రీ వి. వరదరాజా నటించారు. ★



'బభ్రువాహన'లో యల్. [illegible]





మద్రాస్‌లో 'వైణిక సార్వభౌమ' అన్న బిరుదు పుష్పగిరి శంకరాచార్యులద్వారా పొందిన శ్రీ చిట్టిబాబు సన్మానసభకు డా. రాజమన్నార్ (ఎడమప్రక్క నున్నవారు) అధ్యక్షత వహించారు.

రూప యొక్క రూపము... నేడు కూడా మనోహరముగా వుంది!

ఇరవై సంవత్సరాల క్రితము, రాజు మొదటి సారి రూపని కలుసుకున్నప్పటి మాట. రూప యొక్క రూపము లావణ్యము అతని కండ్లలో వెన్నెలవలె ప్రకాశించి మెలసినవి. కొన్ని దినముల తర్వాత అతడు, ఆమె వివాహము చేసుకొన్నారు. ఆ పతి పత్ని ప్రేమ నేటికి కూడ తగ్గలేదు. నేటికి కూడ రూప అంత అందముగానూ వున్నది. ఎందు కంటే ఆమె ఎల్లప్పుడు 'హేజలైన్' స్నోనే వాడుచున్నది. హేజలైన్ స్నో తమ ముఖము యొక్క చర్మమును మృదువుగాను కాంతివంతముగాను చేయును. దీని మీద పౌడరు చాల సేపటివరకు అద్దివుండును.

## — 'హేజలైన్' స్నో సౌందర్యమును నిలబెట్టును.

హేజలైన్ కోల్డ్ క్రీమ్ మరియు హేజలైన్ టాల్కమ్ పౌడర్ కూడ దొరుకును.



బర్రోస్ వెల్కం & కంపెనీ (ఇండియా) లిమిటెడ్,
పి. ఓ. బాక్సు 290, బొంబాయి-1.

61-BW-16

# ఉన్నత ప్రమాణాల మేలు కలయిక 'వివాహబంధం' చిత్రం

సంసారమనేది సాగరం. ఈ సాగరం ఒక్కొక్కసారి ప్రశాంతంగాను, ఆహ్లాదకరంగాను ప్రవహిస్తూ, చూపరులను ఆనందంలో ముంచి వేస్తుంది. అదే సాగరం, ఒక్కోమారు పెనుగాలి, సుడిగాలుల ప్రభావానికి లోనయి చేతి కందకుండా పరవళ్లు త్రొక్కుతూ చూచేవారిని భయభ్రాంతులలో ముంచివేస్తూ ఉంటుంది. ఇది లోకనైజమూ, సహజమూ.

ఈ సాగరం పరవళ్లు త్రొక్కినా, లేక ప్రశాంతంగా ప్రవహించినా—అందుకు 'వివాహబంధం' కూడా కొంత కారణ మవుతుంది. 'వివాహ బంధం' అంటే వెయ్యేళ్ల అనుబంధం. అగ్ని సాక్షిగా తాళికట్టి, ఆలుమగలు కలిసి ఏడడుగులు వేయటంతో ఆ బంధమే విడరాని అనుబంధంగా చిరకాలపు బంధంగా రూపొందుతుంది.

ఇదే ఇతివృత్తాన్ని ఆధారం చేసికొని, బెంగాలీ లోని ప్రముఖ కథ ''సాత్ పాకే బాంధా'' మూలాధారంగా తీసికొంటూ భరణీవారు నిర్మించిన ''వివాహబంధం'' చిత్రం చూస్తున్నంతసేపూ అందరికీ సుపరిచితమయిన ఒక సాంసారిక గాథను చూస్తున్నట్టు, ఆ కథతో మనం కూడా వెళ్లి పోతున్నట్టు అనిపిస్తుంది.

చంద్రశేఖరం విద్యావంతుడు. కళాశాలలో ఉపన్యాసకుడు. చిన్నతనంలోనే 'నా' అన్నవాళ్లందరినీ కోల్పోయి, 'పిన్ని' ఆదరాభిమానాలతో పెరిగి పెద్దవాడయిన ప్రతిభావంతుడు. సంస్కారం కల వ్యక్తి. సందర్భవశాత్తు 'భారతి' అనే కాలేజి అమ్మాయిని కలిసి, ఆమెను తన ప్రవర్తనతో బాగా మెప్పిస్తాడు.

కళాశాల రిటైర్డ్ ప్రిన్సిపాలుగారి కూతురైన భారతి ఆదర్శభావాలు గల స్త్రీ. ఉన్నత ఆశయాలతో తన వ్యక్తిత్వంయొక్క రూపురేఖలను తీర్చి దిద్దుకున్న సంస్కారి. చంద్రశేఖరం ప్రవర్తన, వినయవిధేయతలు చూసి బాగా మురిసిపోయి, అతన్నే వివాహమాడాలన్న కోరికను తండ్రివద్ద వెలిబుచ్చుతుంది. తల్లి సహకారం లభించకపోయినా తండ్రి సహాయం లభించటంతో ఇద్దరూ వివాహమాడి, ఒకచోట చేరతారు.

అప్పటినుంచీ వారిరువురికీ పరస్పరం స్వేచ్ఛతో అభిప్రాయాలను వ్యక్తీకరించుకొనే అవకాశం లభిస్తుంది. ఇద్దరిలో ఒకరిపట్ల మరొకరికి గౌరవము ఎక్కువవుతున్న ఆ సంసారంలో అకస్మాత్తుగా పిడుగు పడుతుంది. తనను పెంచిన ''పిన్నిగారు'' తీర్థయాత్రలకు వెళ్లిపోవాలని చేసుకొన్న నిశ్చయానికి భారతి బాధ్యురాలని చంద్రశేఖరం భావించటంతో ఆ ఇంట కలవరం ఆరంభమవుతుంది. వాస్తవాన్ని వెలిబుచ్చిన భారతి మాటకు స్థానం లభించకపోవటంతో ఆ ఇరువురి అనుబంధం తెగిపోయే ప్రమాదం ఏర్పడుతుంది.

భారతిని తన అన్న పుట్టింటికి తీసుకెళతాడు. ఇటు చంద్రశేఖరానికి పిన్నిగారు వెళ్లటంతో ఏకాంతవాసము లభిస్తుంది. ఎం. ఏ. చదువుతున్న భారతికి, కాలేజీలో కూడా చంద్రశేఖరం తారసపడతాడు. అయినా, వాళ్లిద్దరిమధ్య పొత్తు కుదిరే పరిస్థితులు కనపించలేదు. ఎం. ఏ. ప్రథమ శ్రేణిలో ప్యాసయిన భారతి, ప్రశాంతమైన జీవితాన్ని అన్వేషిస్తూ, ఒకానొక పల్లెటూరికి వెళ్లి ఉపాధ్యాయినిగా చేరుతుంది. అక్కడ కూడా వచ్చిన నిలాపనిందను ధైర్యంగా, సమర్థవంతంగా పరిష్కరించుకో గల్గుతుంది. చెల్లెలు పెండ్లికై పుట్టింటికి వెళ్లిన భారతి, ఆ పెళ్లి దృశ్యాన్ని చూచి, స్మృతిపథంలోకి వెళ్లి, 'వివాహబంధం' ఒక విడదీయరాని మధురమైన అనుబంధం అని తలచుకొంటూ, తిరిగి భర్త దగ్గర కెళ్లిపోవాలని నిశ్చయం చేసుకొంటుంది. తీర్థయాత్రలకు వెళ్లి తిరిగి వచ్చిన ''పిన్నిగారి'' ప్రబోధాల వలన మనస్సు మార్చుకొన్న చంద్రశేఖరం భారతికోసం బయల్దేరుతాడు. ఇద్దరూ ఒకానొకచోట కలిసి, తిరిగి ఏకమవటంతో కథ సుఖాంత మవుతుంది.



'వివాహబంధం' లో రామారావు, భానుమతి.

దీనికి తోడు మరో చిన్న హాస్యకథ కూడా ఉంది. దీనికి నాయకుడు భారతి తమ్ముడు—'వ్యాపారం, వ్యాపారం' అంటూ కలవరిస్తూ ఉండే వ్యక్తి.

ఈ చిత్రంలో ముఖ్యంగా సమకాలీన చిత్రాలతో పోల్చి చూస్తే, ఎన్నో విశేషాలు కనిపిస్తాయి. ముఖ్యంగా, మొత్తంమీద కథలో నిండుదనం కనుపించినా, కథలోని ప్రతి భాగమూ ఎక్కడికక్కడ చాలా సాధారణమైన, సహజమైన సంఘటనగానే కనుపిస్తుంది. చిత్రాన్ని ఈవిధంగా రూపొందించాలంటే ఎంతో చాకచక్యం అవసరం. కథంతా తమకు తెలిసిన కుటుంబ గాథగా అనిపించినా, ప్రతి సన్నివేశంలోనూ, ప్రతి మెట్టులోను ప్రేక్షకుడు తెలిసికోవలసిన అంశాలు పుష్కలంగా ఉన్నట్టు అనిపిస్తుంది. ముఖ్యంగా 'వివాహమన్నది' చిరకాలపు బంధం విడదీయరానిదిగా దర్శకుడు చూపిన చాకచక్యానికి అభినందనలు. భర్తవద్దకు వెళుదామనుకొన్న భారతికి అటుస్త పడిన విపరీతపు పరిణామాలు, భారతిని చూద్దామని చంద్రశేఖరం వెళ్లిన దృశ్యమూ ప్రత్యేకంగా ప్రేక్షకులను వుర్రూత లూగిస్తాయి.

హాస్యకథ కూడా చాలా ముక్తసరిగా ఉంది. ఈ కథను ఇంకేమాత్రంగా పొడిగించినా ఈ సమీక్ష మరోవిధంగా ఉండేది.

చిత్రానికి మంచి కథ ఉండటం ఎలాంటి విశేషమో, ఇందులో శ్రీమతి భానుమతి నటించటం కూడా అంతే విశేషమూ, ఆకర్షణ. తెలుగువారి అభిమానాన్ని విశేషంగా చూరగొన్న భానుమతి, ఇందులో నాయిక భారతిగా చూపిన నటనను గూర్చి కొత్తగా ప్రశంసించబోవటం, వారి మునుపటి చిత్రాలను విస్మరించి చూసినట్లే అవుతుందేమో!

శ్రీ ఎన్. టి. రామారావు చంద్రశేఖరంగా, ఉపన్యాసకుడుగా—ఇటు ఇంటికి మించిన సంస్కారవంతుడైన భర్తగా చూపిన నటన ఇంకా కన్నుల విందుగా మనోహరంగా కనుపిస్తూనే ఉన్నది.

శ్రీ పిచ్చేశ్వరరావుగారిని చూశాక, వారి 'సంభాషణలు' విన్నాక, ఆయనలో ఇంతటి గాంభీర్యమూ, ప్రజ్ఞ ఎక్కడ దాగిఉన్నాయా అనిపిస్తుంది.

మిగతా నటులు పద్మనాభం, నాగయ్య, ప్రభాకరరెడ్డి, సూర్యకాంతం, హేమలత, వాసంతి ప్రభృతులందరూ చిత్రవిజయానికి తోడ్పడ్డారు.

శ్రీమతి భానుమతి రామకృష్ణ సంగీత పర్యవేక్షణలో శ్రీ ఎం. బి. శ్రీనివాస్ వినిపించిన సంగీతం హాయిగా, వీనుల విందుగా ఉంది. శ్రీ సి. నారాయణరెడ్డిగారికి పాటలలో ఉత్తమ సాహిత్యాన్ని సృష్టించటం కరతలామలకమే.

'చిత్రాలలో ఉన్నత ప్రమాణాలు కావాలి, కావాలి' అని కోరే ప్రేక్షకులందరికీ నిర్మాత, దర్శకులు శ్రీ రామకృష్ణ తమ ప్రతిభా విశేషాలను వ్యక్తపరచగా, మంచి దీపావళి కానుకనే సమర్పించారు.

ఆర్థిక జయాపజయాలను ఆధారంగా చేసికొని ఉత్తమ చిత్రాల ప్రమాణాల విలువలను నిర్ణయించ కూడదన్న సూత్రం ఈ చిత్రానికీ వర్తిస్తుందేమో!

—వాకాటి ప్రకాశం ★

## • మద్రాస్‌లో నేర్చుకున్న క్రికెట్ కిటుకులు పటౌడి బొంబాయిలో అప్పగించాడా?

## • మామూలు మనిషి మండిపోతున్న ధరల్లో నిలబడి ఉద్రిక్తత నెలా తట్టుకుంటున్నాడు?

మొత్తంగా అంతర్జాతీయ, జాతీయ రాజకీయ రంగంలో వస్తున్న పరిణామాల దృష్ట్యా అమెరికాలో కొత్త విధానాలు, క్రుశ్చేవ్ విధానాలు— వీటిలో రష్యా ఇదివరకు నెరపుతున్న సంబంధ బాంధవ్యాల తీరు కొనసాగాలని అనుకోడం 'ఆశ'! కొసిగిన్, బ్రెజ్నెవ్‌లకు అందుకునే శుభాకాంక్ష సందేశాలు పదివిగా వెంటనే అందాయి! కొత్తే చైనావాడి ఆటమ్ బాంబు గురించి, అమెరికాలో జాన్సన్‌తో తలపడుతున్న గోల్డ్‌వాటర్ అన్న మాటలు మనం కూడా నమ్మితే హాయి!

"చైనాకి అణ్వాయుధాన్ని సరిగా తయారుచేసి మరొకరి మీద ప్రయోగించడానికి పాతికేళ్లైనా పడుతుంది." అన్నాడతను (పట్టాల్సిందే!)

### ఈసారి రోదసీయానంలో ప్రత్యేకత!

"వోస్కోడ్" అనే ఈ ఒకే 'నౌకలో ముగ్గురు వ్యక్తులు వెళ్లడం వాళ్లు తిరిగి భూమండలాన్ని పారచ్యూట్‌లలో గాక వాహనంతోనే దిగడం అనే రెండు ఇది వరకటి 'రోదసీ నౌకల' ప్రయోగాల కంటే ఇందులో ప్రత్యేకతలని చెప్పాలి! 435000 మైళ్ళ అంతరిక్ష యానాన్ని 24 గంటల 17 నిమిషాలలో 17 భూప్రదక్షిణాలలో ముగించుకుని నేలమీదకు దిగిరాగలిగిన ఈ "నౌక"లో చోదకుడు కొమరోవ్‌తో పాటు డాక్టర్ అయిన యొగొరోవ్ సైంటిస్ట్ ఫియోక్టిస్టోవ్ లిద్దరూ

11 వ పేజీ తరువాయి

సురక్షితంగా ఉండగలిగారు! కాస్మిక్ కిరణ వలయంలోని కొత్త విశేషాలు దొరికాయని అంటున్నారు ఇది రోదసి శాస్త్రంలో మరో మెట్టు!

### కిటుకులు ఎరిగిన క్రికెట్

మన వాళ్ళు ఓడిపోతే ఆ జట్టు గట్టిది. మన వాళ్ళు గెలిస్తే ఆ జట్టు వోటిది అనే వాళ్ళింకా లేకపోలేదు.

కాని ఇంగ్లండు వెళ్ళుతున్నప్పుడు 'నా సి' టీము అనిపించుకున్న సింప్సన్ జట్టు తిరిగి మళ్ళీ వాళ్ల 'మొక్కుబడి' చేసి బోలెడు అనుభవం గడించారు! సింప్సన్ ఇబ్బంది పడతారన్నారు. మకంజీ బంతులు జోరుగా విసరడన్నారు. కాని, సింప్సన్ నైపుణ్యం ఏకం కోసం క్రికెట్ ఆడటం అని—ఓపెనింగ్ జంట విడిపోయేలోగానే చాలినంత ధైర్య స్థైర్యాలు తన టీముకి లభ్యమవుని, మద్రాసులోనే తెలుసుకోగలిగాం. బౌలర్లు చేతులుపిరికి, డీలా పడి పోయేలా బంతి పని పోయేదాకా, 'బాట్' గాలిలోకి విసరకుండా ఆడటం—ఆతర్వాత 'బాదండ్రా' అంటూ సహచరులను పంపడం అతని టెక్నిక్!— మద్రాసులో పటౌడి నేర్చుకున్న పాఠాలే, బొంబాయిలో సింప్సన్ టీముకి అప్పజెప్పడం జరిగింది. జోరుగా బంతి వస్తే బాట్ గాలిలోకి విసిరే మనవాళ్ళు 'స్పిన్' వస్తే డాన్సు చేసే "కంగారూ"లు కూడా అసాధారణ ఆటగాళ్ళు ఉన్నవాళ్ళే! సైకిలాజికల్‌గా మామూలు మండల పరుగులు బోర్డుమీద ఉండగానే బెదిరిపోతే పటౌడి జట్టు ఆస్ట్రేలియన్‌లకి తీసిపోదు. మంజ్రేకర్ తప్ప మిగతావారంతా కొత్త నీరులా ఆడగల సమర్థులే! ఈసారి మంచి ఉత్తేజకరమైన క్రికెట్‌ని అందించిన ఘనత రెండు జట్లవారికి సమంగా వెళ్తుంది! 'లార్డ్',కి ఒక ప్రశంస, నాడ్కర్ణి, దురానీ, (మద్రాసు టెస్ట్ అవుతోంది అంటూ రాస్తున్నప్పుడు—దానిలో కూడా తాడో పేడో తేలిపోతుంది!) చంద్రశేఖర్‌కి ప్రత్యేకంగా ఓమాటూ రాయాలి. కొత్త బంతికి నిలబడ గలిగితే మన టీముకి ఉత్తమ తరగతి స్థానం తక్షణం వస్తుంది.!

దిన పత్రికలు చదివే మా పాఠకులకు ఇంకా లెక్కలు అంకెలు రాస్తూ చెప్పక్కర్లేదు. గాని బ్రిటన్ ఎన్నికలు హోరాహోరీ పోరాటంగా జరిగాయి. లేబర్ మెజారిటీ బహు స్వల్పంగా ఉంది చూడాలి మరి.

ఏది ఏమైనా అక్టో 16 వాలా విశేష విస్మయ నోదకరమైన వార్తలతో అందర్నీ కదిలించింది.

— వీరాజీ ★

### రంగావలోకనం

49 వ పేజీ తరువాయి

భూమికలు ధరించిన మీనాకుమారికే ఒక విశిష్టమైన పాత్ర ఇచ్చి అపూర్వంగా రూపొందించారు.

తమ అన్ని చిత్రాలలో సాంకేతిక పరిజ్ఞానానికి కొత్త ప్రమాణాలు సృష్టించారు. "చౌదవీకా చాంద్" చిత్రంలో వెనుకబడిన ఎమ్. సాదిక్‌ను దర్శకునిగా పునః పరిచయం చేశారు. "సాహెబ్ బీబీ"లో అబ్రార్ అల్వీ అనే రచయితను దర్శకునిగా నిలబెట్టారు. సంగీత దర్శకులెవరైనా సరే, హేమంత కుమార్, రవి, బర్మన్, నయ్యర్, తమ చిత్రాలలో అపూర్వమైన సంగీతాన్ని వినిపించారు. తెలుగు చిత్రాలలో వీధి నాట్యాలు చేస్తున్న వహీదా రహమాన్ జీవితంలో అదృష్ట దేవతయై ప్రవేశించి నటనా శిఖరాల నెక్కించారు.

ఇతర నిర్మాతలకు గురుదత్ నటించిన చిత్రాలు "బారా బడ" "సౌతేలా భాయి" "బహూ రాణి". ప్రతి చిత్రంలో కూడా నటన సమర్థమైనదీ, సున్నితమైనదీ అన్న పేరు తెచ్చుకున్నారు.

వారి చిత్రాలు ఇప్పుడు నిర్మాణంలో ఉన్నవి మూడు. తమిళ చిత్రం "శారద" ను ఎవిఎమ్ వారు హిందీలో తీస్తున్నది ఒకటి. తమ స్వంత చిత్రం "బహారే ఫిర్ భీ ఆయేంగీ". "మొగలే అజమ్" నిర్మాత కె. ఆసిఫ్ పెద్ద పెట్టుబడితో నిర్మిస్తున్న "లవ్ అండ్ గాడ్" అనే రెండో మజ్నూ, ఇవి కాక ఈ మధ్యనే ఒక బెంగాలి చిత్రంలో కూడా నటించడానికి ఒప్పుకున్నారని వినికిడి.

వారి చిత్రాలలో ప్రత్యేకతను, వారి స్వభావంలో సరళతను, వారి కళా సాధనలో నిష్ఠతను, వారి నటనలో పరాకాష్ఠను గమనించిన ఆ విశేష ప్రజానీకానికి వారి మరణం తీరని, విచారకర వార్త.

వారి ఆత్మకు శాంతి, భార్య బిడ్డల మనసుకు ఉపశాంతి భగవంతుడు అనుగ్రహించు గాక.

వి. ఏ. కే ★

---

### ఇంటింటి పద్యాలు

**ఆరుద్ర**

**'చిదిమిన పొల్లారు చెక్కుటద్దములు'**

బ్యాంకిలో వున్నంతకాలం నీ అసలు ఫాయిదాలు
భవిష్యత్తు సుఖాలకు పాడుతాయి దాయి! దా! లు
నువ్వు దాచుకున్న డబ్బు ఎవరికో అప్పిచ్చి
నవ్వుతూ ఎంతెంతో వడ్డీ తెచ్చి
జమకడతారు నీ ఖాతాకే బుద్ధిగా
తెచ్చిందంతా కాదు ఏదో కొద్దిగా
నువ్వు ఎన్ని లక్షలు తెచ్చినా తక్షణం పుచ్చుకొంటుంది వాళ్ల ఆఫీసు
నువ్వు పెద్ద మొత్తం డ్రా చేయదలిస్తే మాత్రం ఇవ్వాలి తగు
మాత్రం నోటీసు
కడవంత గుమ్మడికాయ వైనా నువ్వేం కత్తిపీటవా? చాకువా?
ఇచ్చేవాడికెప్పుడూ పుచ్చుకొనేవాడు లోకువ!

---

**Edited, Printed and Published by S. Radhakrishna at the AndhraPatrika Press; 6 &7 Thambuchetty Street Madras-1. Phone; 22244 & 23713. Chief Editor S. Sambhu Prasad.**



'వివాహబంధం'లో భానుమతి

